శ్రీరస్తు

# అపరోక్షానుభూతి

శ్రీ మహాగణాధిపతయేనమః శ్రీ మేధా దక్షిణామూర్తయేనమః

శ్రీ శంకరాచార్య విరచిత అపరోక్షానుభూతి

పుద్దులపల్లి మాణిక్యశాస్త్రిచే రచింపబడిన తత్వరహస్యప్రభయను

తెలుగు తాత్పర్యవివరణ సహితము.

శ్లో॥ శ్రుతిస్మృతి పురాణానామాలయం కరుణాలయం।
నమామి భగవత్పాదశంకరం లోకశంకరం॥

శ్రీ శంకర భగవత్పాదులవారు సాక్షాత్తుగా పరశివావతారమని గ్రంథములయందు కనిపించుచున్నది. వారు అవతరించి లోకమునకుచేసిన ఉపకారము ఇంతయనిచెప్పుటకు శక్యముకాదు. మోక్షమార్గమునకు ప్రతిబంధమైన బౌద్ధమతం, జైనమతం మొదలగు నాస్తికమతములను ఖండించిరి. పరమార్థమునకు విరుద్ధమగు మరికొన్ని మతములను కూడా ఖండించిరి. వారు ఇతరమతములను ఖండించుటలో జీవులు మోక్షమార్గమును తెలిసికొనలేక దుఃఖమయమగు అజ్ఞానమూలకమగు సంసారబద్ధులై యల్లపుడు జన్మమరణములకు పాలగుదురేమోయని దయయే కారణంగాని, ఆయామత కర్తలయందు ద్వేషం కారణం కాదు.

అద్వైతసిద్ధాంతమందు అంతయు ఆత్మస్వరూపమేగనుక మహాను భావులు ఇతరులను ద్వేషించవలసిన పనిలేదు. శంకరులు అనగా

(శంకరోతీతి శంకరః) శం. అనగా సుఖమును, కరోతి చేయువాడుగనుక. శంకరులని వారిపేరు. సుఖమనగా విషయభోగమువలనకలిగే నాశస్వభావముగల నీచసుఖంకాదు. ఏమనగా మోక్షానందమని యర్థము. ఆత్మస్వరూపమగు అట్టి మోక్షానందమును అజ్ఞానముచేత తెలిసికొనలేక పొందలేకున్నజీవులకు, అద్వైతతత్వము నుపదేశించి అపరోక్షానుభూతిని యనుగ్రహించి మోక్షానందమునిచ్చువారే శంకరాచార్యులవారు. రెండువేల సంవత్సరములకు పూర్వకాలంలోనే అవతరించి అద్వైతవేదాన్తశాస్త్రమును అభివృద్ధి చేసిరి. శంకరాచార్యులవారి మాహాత్మ్యమును నాల్గువేదములకు వ్యాఖ్యానముచేసిన విద్యారణ్యస్వాములవారు, చాలా అతీతముగా చెప్పిరి.

మధుసూదనసరస్వతీ స్వాములవారు, సురేశ్వరాచార్యులవారు,పద్మపాదాచార్యులవారును, శంకరాచార్యులవారు ఈశ్వరస్వరూపులనిచెప్పి,వారి మహిమ సర్వాతీతమని చెప్పిరి. అట్టి జ్ఞానమూర్తియగు శంకరాచార్యులవారు పిన్నవయసులోనే ప్రస్థానత్రయ భాష్యములను వ్రాసిరి. అందులో బ్రహ్మసూత్రభాష్యమునకు అనేకవ్యాఖ్యానములు, ఆవ్యాఖ్యానములకు వ్యాఖ్యానము వాటిమీద కూడా వ్యాఖ్యానములు ఈరీతిగా అతిగంభీరమగు సూత్రభాష్యార్థమును అనేకయుక్తులతోను కఠినమైన శాస్త్రచర్చలతోను వ్యాఖ్యాతలు విపులీకరించిరి. అటులనే భగవద్గీతాభాష్యమునకుకూడా అనేక వ్యాఖ్యానములుకలవు. ఆ వ్యాఖ్యానములతో భాష్యమును సమన్వయపద్ధతితో పరిశీలించిన చాలా గహనముగా నుండును. ఉపనిషద్భాష్యమునకు కూడా వ్యాఖ్యానము, కొంతభాగమునకు వార్తికము ఆ వార్తికమునకు వ్యాఖ్యానము ఈవిధముగాప్రస్థానత్రయభాష్యములు ప్రబలముగానున్నవి. గనుక తత్వమంతయు సామాన్యులకుకూడా సుఖముగా తెలియుటకు అనేక వేదాన్త స్తోత్రములను వ్రాసిరి.

అందులోకూడా అపరోక్షానుభూతియను ఈ ప్రకరణమును వేదాన్త

శాస్త్రంలో తెలుసుకొనతగిన అన్ని విషయములు బాగుగాను సులభము గాను తెలియునటుల వ్రాసిరి. అపరోక్షానుభూతియను పేరునుబట్టియే గ్రంథముయొక్క గొప్పతనమును గుర్తించవచ్చును. సాధనములకంటే ఫలమే ప్రధానం. సకల వేదాంతశాస్త్రాభ్యాసమునకు అనగా శ్రవణమనన నిదిధ్యాసలకు అపరోక్షానుభూతియే ఫలం. అపరోక్షానుభూతియనగా జ్ఞానరూపమగు బ్రహ్మ సాక్షాత్కారమే.

గ్రంథమునకుకూడా అపరోక్షానుభూతియని పేరు పెట్టిరి. గ్రంథ మనగా వాఙ్మయంకదా. అనగా కొన్నిశబ్దముల సముదాయమే. అటువైన శబ్దసముదాయరూపమగు గ్రంథము. అపరోక్షానుభూతి స్వరూపముకాదు. గనుక ఈ గ్రంథమునకు అపరోక్షానుభూతియనిపేరు ఎట్లుకుదురును ? అంటే ఈ గ్రంథములో చెప్పినప్రకారం ఈ గ్రంథమును శ్రవణముచేసి అర్థమును మననంచేసి తత్వమును ధ్యానంచేసినయడల బ్రహ్మసాక్షా త్కారం కలుగును. ఇట్టిఅపరోక్షానుభూతిని కలుగచేయునది. గనుక ఈ గ్రంథమునకు అపరోక్షానుభూతియని పేరు పెట్టిరి. వివేక వైరాగ్యాదిసాధన సంపత్తి కలవారికి ఈ గ్రంథమును ఒకపర్యాయం శ్రవణంచేసినను చదివి నను ఆ జన్మలోనే బ్రహ్మాపరోక్షానుభూతికలిగి ముక్తి లభించును.

ఈ విధముగానే శంకరభగవత్పాదులవారు ఉపనిషద్భాష్యమును వ్రాయుచు ఉపనిషత్ అను శబ్దమునకు అర్థమును ఇట్లుచెప్పిరి. గర్భజన్మ జరామరణములను శిథిలముగాచేయునది గనుక ఉపనిషత్ అనిపేరు. మూలాజ్ఞానమును పూర్తిగా నశింపచేయునది గనుక ఉపనిషత్ అని పేరు. మరియు జీవుని పరమాత్మతో ఐక్యమునుపొందించునది గనుక ఉపనిషత్ అనిపేరు. గర్భజన్మజరామరణాదులను శిథిలముచేయునది, మూలాజ్ఞాన మును నశింపచేయునది, జీవునికి పరమాత్మతో ఐక్యమునుపొందించునది

బ్రహ్మాపరోక్షానుభూతియేకాని మరియొకటికాదు. అనగా బ్రహ్మ సాక్షాత్కారమనే అర్థము. ఉపనిషత్ అనగా వేదశిరోభాగమైన వాఙ్మయంకదా. వాఙ్మయమనగా శబ్దసముదాయమేకదా. అయితే శబ్దసముదాయమునకు

తాత్పర్యం.

(అపరోక్షానుభూతిని) బ్రహ్మవిద్యను బోధించు ఉపనిషచ్ఛబ్దము ఎట్లా కుదురును. అంటే ఉపనిషత్తనే బ్రహ్మావిద్యను ప్రతిపాదించునది గనుక అనగా కలుగచేయునది గనుక శబ్దరూపమైన వేదభాగమునకు ఉపనిషత్తు అనే పేరు వచ్చినదని ప్రతిపాదించిరి.

అటులనే అపరోక్షానుభూతి యని పేరుకూడా ఈ గ్రంథమునకు పెట్టిరి. ఈ గ్రంథమందు తత్వవిచారమునకు అవసరమైన అన్ని విషయములను నిర్వచన చేసి విశదపరచిరి, ఈ గ్రంథమునకు శ్రీ విద్యారణ్యస్వాములవారు వ్యాఖ్యానమును వ్రాసిరి. జిజ్ఞాసువులందరికిని సులభముగా మోక్షసాధనమగు అపరోక్షానుభూతిని అనుగ్రహించుటకై శంకర భగవత్పాదులవారు ఈ అపరోక్షానుభూతి యను గ్రంథమును వ్రాయుచు నిర్విఘ్నముగా ఈ గ్రంథము పూర్తియగుటకు ఈ గ్రంథమును చదువువారికి వినువారికి కూడా నిర్విఘ్నముగా బ్రహ్మవిచారము కొనసాగుటకును శ్రీహరి నమస్కారమనే మంగళము నాచరించుచు మొట్టమొదట ఈ మంగళ శ్లోకమును వ్రాయుచున్నారు.

**శ్లో॥ శ్రీహరిం పరమానంద ముపదేష్టా రమీశ్వరం।**
**వ్యాపకం సర్వలోకానాం కారణంతం నమామ్యహం॥౧**

ఈ మంగళ శ్లోకమునకు మాత్రం ప్రతిపదార్థమును వ్రాసి ఈ గ్రంథ

మందరి తక్కిన అన్నిశ్లోకములకును ప్రతిపదార్థము కూడా తెలియు నటుల యథాశక్తి గ్రంథము విస్తారముకాకుండా తాత్పర్యమునే వివరణగా వ్రాయుచున్నాను.

ప్రతిపదార్థము:

అహం=నేను;తం=ఉపనిషత్తులయందు ప్రసిద్ధమైనసకలజగత్కారణమైన సచ్చిదానందరూపమగు పరమాత్మను; నమామి=నేనే పరమాత్మ స్వరూపుడినని ధ్యానించుచున్నానని యర్థము. ఆ మహానుభావుడే ధ్యానింప తగినవాడని చెప్పుటకు శ్రీహరిం అని విశేషణమును చెప్పిరి. లక్ష్మీసమేతుడని యర్థము. శ్రీః అనగా సృష్టిస్థితిలయములయందును ఇతర సర్వావస్థలయందును, సర్వజీవులచేత సంసార ప్రవృత్తికి కారణముగా నాశ్రయింపబడు అజ్ఞానమని యర్థము. అట్టి అజ్ఞానమును ఆత్మజ్ఞానము ననుగ్రహించి నశింపచేయువాడు గనుక శ్రీహరి యనబడు చున్నాడు.

మరియు శ్రీః అనగా చరాచర సర్వప్రపంచముచే నాశ్రయింపబడు అధిష్ఠానమగు పరమాత్మయని యర్థము. అట్టి శ్రీరూపమైన వాడే హరిగనుక శ్రీహరి యని చెప్పబడుచున్నాడని యర్థము. అజ్ఞానమును పోగొట్టినంత మాత్రంతో ఉపయోగమేమంటే పరమానంద రూపమగు మోక్షము లభించునని చెప్పుటకు పరమానందం అను విశేషణమును చెప్పిరి. పరమానందమనగా, నాశనములేని సర్వోత్కృష్టమగు అనగా అన్నిటి కంటే గొప్ప ఆనందస్వరూపుడే శ్రీహరియని యర్థము. అయితే లోకంలో విషయసంబంధం వలన కలుగు ఆనందం అనగా సుఖం. జడముగా అనుభవమున్నది. అటులనే ఈ పరమానందముకూడా జడమని శంకింతురేమోయని, ఉపదేష్టారం అను విశేషణమును చెప్పిరి. గురురూపముగా నుండి తత్త్వమును తెలిసికొన తలచినవారికి తత్త్వము నుపదేశించు చైతన్య స్వరూపుడనియర్థము.

అయితే అనందరూపముగా నున్న నిరుపాధికుడైన పరమాత్మ ఎట్లా ఉపదేశించుననే శంకకు సమాధానముగా ఈశ్వరం అని చెప్పిరి. సర్వులను శాసించువాడు సర్వశక్తులతో కోరిన మాయాశక్తి ఉపాధిగా కలవాడని యర్థము. అట్టి మహానుభావుడు గురురూపముగా నుండి ఉపదేశించుటలో సందేహము లేదని యభిప్రాయము. పరిచ్ఛేదము గల భౌతిక పదార్థములవలె అనాత్మ యనియు పరిచ్ఛిన్న స్వరూపమనియు అనగా పరిమితిగల స్వరూపమని యాశంకింతురేమో యని వ్యాపకం అని చెప్పిరి. సత్తాస్వరూపము చేతను సర్వప్రకాశక జ్ఞానస్వరూపముచేతను. సర్వమును నిండి అనంతముగా నున్నాడని యర్థము. వ్యాపకమనగా వ్యాపించువాడని యర్థముకదా వ్యాపింపబడే మరియొక్కటి లేనిదీపరమాత్మ వ్యాపకమని చెప్పుటకు వీలులేదు, గనుక వ్యాపింపబడునది ప్రపంచం వ్యాపించునది పరమాత్మయని చెప్పవలసి వచ్చును, అట్లయిన వేదాన్తుల కిష్టమైన అనంతత్వము పరమాత్మకు కుదరదే. అనగా రెండువస్తువులున్న వంటే అందులో ఒకవస్తువు అనంతముకాదు. రెండవ వస్తువే మొదటి వస్తువునకు అంతము అనగా అనంతత్వమును సిద్ధించకుండా చేయునది. యని భావము.

అటులైన ప్రపంచమనే వ్యాప్యమున్నపుడు పరమాత్మయను వ్యాపకమున్నను, పరమాత్మకంటే రెండవదైన ప్రపంచము పరమాత్మకు అనంతత్వమును సిద్ధించకుండాచేయును. గనుకపరమాత్మకు అనంతత్వము కుదరదేమోయని శంకకు సమాధానముగా సర్వలోకానాం కారణం అని చెప్పిరి. సర్వలోకములకు అనగా సర్వ ప్రపంచమునకు (కారణం) అభిన్న నిమిత్తోపాదానం అనగా ప్రపంచమునకు పరమాత్మయే ఉపాదాన కారణం పరమాత్మయే నిమిత్తకారణమని యర్థము. అటులైన ఉపాదాన కారణముకంటే యేకార్యమువేరు కాదుగనుక ప్రపంచమంతయు కార్యమే

గనుక పరమాత్మ ఉపాదానమైనపుడు. పరమాత్మకంటే ప్రపంచం వేరు కాదు గనుక పరమాత్మ అనంతమగునని యర్థము. అట్టి శ్రీహరిని పై చెప్పిన విధముగా నమస్కరించు చున్నానని యభిప్రాయము.

తాత్పర్య వివరణ.

ఈ మంగళ శ్లోకంలో వ్యాపకం సర్వలోకానాం కారణంతం నమామ్యహం, అని యున్నది. సర్వలోకములకు కారణమైన పరమాత్మను నమస్కరించుచున్నానని యర్థముకదా, అయితే అద్వైత సిద్ధాంతములో జీవుడు బ్రహ్మస్వరూపుడేగాని వేరుకాదు, అయినపుడు ఆయనే ఆయనకు నమస్కారము చేయుట ఎట్లు కుదురును ? నన్ను నేను నమస్కరించు చున్నానని యనుట అనుభవ విరుద్ధముకదా అంటే సత్యమే. నిరుపాధిక స్వరూపంలో జీవేశ్వరులకు భేదంలేదు గనుక నమస్కరింపబడువాడు నమస్కరించువాడు అను భేదం లేనపుడు నమస్కరించుట కుదరదు. కాని మాయోపాధికుడు ఈశ్వరుడు. అంతఃకరణోపాధికుడు జీవుడు. అనే వ్యవస్థ కల్పనాదశయందు చేసిరి. ఒకే ఆకాశమునకు ఘటాకాశము, మఠాకాశము అని ఉపాధిద్వారా రెండు రూపములు యేర్పడినట్లు పరమాత్మకు కూడా మాయా అంతః కరణయను వుపాధులద్వారా ఈశ్వరడని జీవుడని రెండు రూపములు యేర్పడినవి. అటులైనయెడల మాయోపాధికుడైన శ్రీహరికి. అంతఃకరణోపాధికుడనైను నేను నమస్కరించు చున్నానని చెప్పుట, చేయుటకూడా కుదురును. సర్వోపాధి రహితమైన పరమాత్మను నమస్కరించుచున్నానని అనేయడల పరమాత్మ స్వరూపుడనే నేనని బ్రహ్మైక్యాను సంధానమే నమస్కారమని అర్థం చెప్పిన సరిపోవును.

వ్యాపకం సర్వలోకానాం కారణంతం నమామ్యహం అని చెప్పిరి.

సర్వలోకములకు కారణం. అనగా సర్వప్రపంచమునకు పరమాత్మయే ఉపాదాన కారణం నిమిత్తకారణంకూడా. ప్రపంచంలో కుండ అనే ఒక కార్యమునకు ఉపాదాన కారణం మట్టి. నిమిత్తకారణం కుమ్మరి నీరు మొదలగునవియని, ఉపాదానకారణం, నిమిత్తకారణం వేరుగానున్నవి. కాని ప్రస్తుతం మాత్రం ప్రపంచమునకు అద్వైత సిద్ధాంతంలో బ్రహ్మయే ఉపాదానకారణం, బ్రహ్మయే నిమిత్తకారణమని విశేషమును గ్రహించవలయును. ఈవిషయమును బ్రహ్మసూత్రములలో వేదవ్యాసులవారు సూచించిరి. భాష్యంలో శంకర భగవత్పాదులవారు స్పష్టముగా చెప్పిరి.

ఉపాదానకారణమనగా అధిష్ఠానమనే చెప్పవలయును. అటులైన యడల కార్యవర్గమంతయు ఆరోపములోనే చేరును. ఆరోపమని చెప్పబడునుకూడా, గనుక అనాదియగు మాయా అవిద్యా మొదలగునవికూడా అనాదిరూపములగా ఆరోపితములే గనుక ఆరోపవర్గంలోనే చేరును అటులైనయడల ఆరోపవర్గమంతయు అధిష్ఠానంకంటే వేరుకానపుడు అధిష్ఠానమగు పరమాత్మను తెలిసికొన్నయడల సర్వమును తెలిసికొన్నట్లే. నని ఉపనిషత్తులయందు చెప్పబడిన ఏక విజ్ఞానముతో సర్వవిజ్ఞానముకలుగుననే ప్రతిజ్ఞ కూడా సరసముగా కుదురును.

ఈ ప్రతిజ్ఞ అద్వైతసిద్ధికొరకే యేర్పడినదని వివరముగా వెనుక వ్రాసియుంటిని. మోక్షప్రదమగునది తత్వశాస్త్రంగనుక ఈ శాస్త్రవిచారములో పునరుక్తిని శంకించకూడదు. అని వార్తికకారులుకూడా చెప్పిరి, జీవబ్రహ్మైక్య విషయమును శాస్త్రయుక్తులతోను,అనుభవముతోను ఎన్ని పర్యాయములు విచారించినను చాలా ఆశ్చర్యము కలుగుచుండును. ఆనందం కూడా కలుగుచుండునని. పలుమారులు చెప్పవలసిన విషయమే. అధికారి స్వరూపం, సాధనస్వరూపం, ముక్తిస్వరూపం, సాధనచేయువిధానం, సంప్ర

దాయస్వరూపం, జ్ఞానియొక్కస్థితి, ఆరోపవివరణము అన్నియు ఈగ్రంథ విచారణవలన, తేటతెల్లగా తెలుసుకొనవచ్చును. బ్రహ్మవిచారం అవశ్యక మనేవిషయంకూడా విశదమగును. ఇట్టి అనుభవప్రధానమగు ఈ వేదాంత శాస్త్రసంగ్రహగ్రంథమునకు మొదట శ్రీ శబ్దప్రయోగముచేసి శ్రీహరి నమస్కారమనే పరమమంగళము నాచరించిరి. గనుక ఈ గ్రంథమునకు నిర్విఘ్నసమాప్తియు, ఈ గ్రంథమును శ్రవణంచేయువారికి విఘ్నం లేకుండా సిద్ధియు కలుగునని తాత్పర్యమును మనం గ్రహింపవలయును.

శ్లో॥ అపరోక్షానుభూతిర్వై ప్రోచ్యతే మోక్ష సిద్ధయే।
సద్భి రేవ ప్రయత్నేన వీక్షణీయా ముహుర్ముహుః॥ ౨

తాత్పర్య వివరణం.

అపరోక్షానుభూతి యనగా తత్వమస్యాది మహావాక్యశ్రవణాది విచారంవల్ల కలిగిన బ్రహ్మ సాక్షాత్కారమే. అట్టి అపరోక్షానుభూతికి గొప్ప సాధనముగనుకనే ఈ గ్రంథమునకు అపరోక్షానుభూతియని పేరు పెట్టిరని స్పష్టమైన విషయమే. సంసారమందు, విషయసుఖములయందు వైరాగ్యముకలిగి పునరావృత్తి రహితమగు మోక్షమునుకోరు ఉత్తమాధి కారులకు మోక్షము సిద్ధించుట కొరకు ఈ గ్రంథము చెప్పబడుచున్నది. మోక్షమనగా జీవభావమునువిడచి నిర్విశేషపరమాత్మ స్వరూపముగానుండు టయేగాని. సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములుకావు.

యెందువలననగా మోక్షసిద్ధికి అపరోక్షానుభూతిని చెప్పుచున్నాము గనుకఅపరోక్షజ్ఞానమే మోక్షమునకు సాధనమని చెప్పినట్లయినది. జ్ఞానమే మోక్షమునకు సాధనమని చెప్పుటవలన బంధము అజ్ఞానమువలననే యేర్పడినదని జీవత్వముకూడా అజ్ఞానమువలననే యేర్పడినదని తెలియు

చున్నది. ఇదియేగాక. జ్ఞానంవలన అజ్ఞానమే పోవుసుగాని, మనలో లేని ఫలం లభించదుగనుక, జీవునికి పరమాత్మ స్వరూపం సిద్ధమయియే యున్న దని, అజ్ఞానముచేత స్వరూపమును తెలుసుకొనలేక జీవుడనని భ్రాంతిని పొందెననికూడా తెలియుచున్నది. అందుచేత మోక్షము దేశాంతరమునకు వెళ్లి పొందతగినదికాదనికూడా గుర్తించవచ్చును.

అందుచేత ముముక్షువులైన సజ్జనులు ఈ యపరోక్షానుభూతియను గ్రంథమును మాటిమాటికిని విచారించవలయును. మాటిమాటికియని చెప్పు చేత ఈశ్రవణమననాది విచారముఅపరోక్షానుభూతికలుగునంతవరకు చేయ వలయునని స్పష్టమగుచున్నది. శ్రవణాది విచారం మాటిమాటికి చేయవలె నని బ్రహ్మసూత్రములలో వేదవ్యాసులవారుచెప్పిరి. శంకర భగవత్పాదుల వారుకూడా ధాన్యం (వడ్లు) యెన్నిపర్యాయములు దంపవలయునంటే నియమంలేదు. పొట్టు పూర్తిగాపోయి బియ్యం లభించినంతవరకు దంప వలయును. అటులనే వేదాంతవిచారము అజ్ఞానము పొయ్యేంతవరకు జీవత్వభ్రమ, ప్రపంచభ్రమ పోయ్యేంతవరకు చేయవలయునని సూత్ర భాష్యంలో స్పష్టముగా చెప్పిరి.

వేదాంతశాస్త్రమందు జీవబ్రహ్మైక్యమే ప్రధానవిషయం. మోక్షమే పరమప్రయోజనం. సాధన చతుష్టయసంపన్నుడే ముఖ్యాధికారి.విషయము నకు గ్రంథమునకుగల ప్రతిపాద్యప్రతిపాదకభావసంబంధమే సంబంధము ఇవియేఅనుబంధచతుష్టయమని చెప్పబడుచున్నవి. ఈయనుబంధచతుష్టయ ముచుబట్టియే శాస్త్రమందలి తత్వమును తెలుసుకొనతలచినవారు శాస్త్రమును చదువుటకుగాని, వినుటకుగాని ఉత్సాహముగా ప్రవర్తించుదురు. అటులనే ఈ యపరోక్షానుభూతియందుకూడా, జీవబ్రహ్మైక్యమనే విషయము

మోక్షమనే ప్రయోజనము, సాధనసంపత్తిగల యధికారియు, సంబంధము అనుబంధ చతుష్టయమగు ఈ నాల్గును సూచింపబడినవి.

శ్లో॥స్వవర్ణాశ్రమధర్మేణ తపసాహరితోషణాత్।
సాధనంప్రభవేత్పుంసాం వైరాగ్యాదిచతుష్టయం॥ 3

తాత్పర్య వివరణం.

మోక్షమునకుసాధనం అపరోక్షబ్రహ్మ సాక్షాత్కారమే. అట్టి అపరోక్షానుభూతి సాధనచతుష్టయసంపన్నుడికే కలుగును. అట్టి సాధన చతుష్టయము జీవునికియెటుల కలుగుననగా బ్రాహ్మణులు, క్షత్రియులు వైశ్యులు, శూద్రులు అను నాల్గువర్ణములవారికిని, బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము అను ఆయాఆశ్రమములవారికిని, యే యే కర్మలు అవశ్యముగా చేయతగినట్లు చెప్పబడినవో ఆయాకర్మలయొక్క ఫలములయందు కోరిక లేకుండా ఈశ్వరార్పణ బుధ్యాస్వకర్మానుష్ఠానం చేయుటచేతను. అనేక పాపములను నశింపచేయు కృచ్ఛచాంద్రాయణాది తపస్సుచేతను,భగవంతునికి ప్రీతికరమైన భగవదారాధనవలన. భూతదయమొదలగు భగవంతునికి సంతుష్టనికలిగించు సాధనవలనను వైరాగ్యము మొదలగు నాల్గు సాధనములు కలుగును.

నాల్గు సాధనములనగా నిత్యానిత్యవస్తువివేకము ఇహాముత్రార్థఫల భోగవిరాగము. శమదమతితిక్షాఉపరతిశ్రద్ధాసమాధానములగు ఆరు అనగా ఈ ఆరును ఒకే సాధనంకింద లెక్కించవలయును. ముముక్షుత్వము ఈ నాల్గుసాధనములు పైచెప్పినవిధముగా ఆచరించినవారికి తప్పక కలుగును. ఇవి కలిగినవారికి అపరోక్షానుభూతి తప్పక కలుగును. అపరోక్షానుభూతి కలిగినవారికి మోక్షము తప్పక లభించునని తాత్పర్యము. వైరాగ్యాది

చతుష్టయము యొక్క స్వరూపం ముందు శ్లోకములలో స్పష్టముగా చెప్పుచున్నారు.

హరితోషణమే ప్రధానం అట్టి హరితోషణమనగా భగవంతునికి కలుగుతృప్తియే. అట్టి హరితోషణం భగవదాజ్ఞను దాటినవానికి కలుగదు. వేదశాస్త్రములు భగవంతుని యాజ్ఞారూపములే గనుక వేదశాస్త్రములు యెవరిని యేవిధముగా ఆచరించమని చెప్పుచున్నవో అవిధముగా ఆచరించ వలయును గాని అహంకారముతో శాస్త్రమార్గమును విడిచిపెట్టకూడదు. చేతనైనంతవరకైనను ఆచరించవలయును. అట్లుల చేయనియెడల భగవద నుగ్రహం కలుగదు. భగవదనుగ్రహం కలుగనిది సాధనసంపత్తి కలుగదు. అదిలేనిది జ్ఞానం కలుగదు. ముక్తియు కలుగదని గుర్తించ వలయును. వైరాగ్యమును చెప్పుచున్నారు.

శ్లో॥ బ్రహ్మాదిస్థావరాంతేషు వైరాగ్యంవిషయేష్వను।
యథైవకాక విష్ఠాయాం వైరాగ్యం తద్ధినిర్మలం ౪

తాత్పర్య వివరణం.

కాకిమలమందు ఎట్ల అసహ్యబుద్ధి కలిగి కోరికలేకుండా వుండునో అట్లే బ్రహ్మలోకము లగాయితు మనుష్యలోకమువరకు సమస్త సుఖము లకు సాధనమైన విషయములయందు కోరికలేకుండా వుండుటయే మంచి వైరాగ్యము.

శ్లో॥ నిత్యమాత్మ స్వరూపంహి, దృశ్యంతద్విపరీతగం।
ఏవంయోనిశ్చయ స్సమ్యగ్వివేకోవస్తు నస్సవై॥ ౫

తాత్పర్య వివరణం.

వైరాగ్యమునకు కారణమైన నిత్యానిత్య వస్తు వివేకమును చెప్పుచున్నారు. ఎన్నిమారినను మార్పులేకుండా సాక్షిగానున్న ఆత్మయే నిత్యము. అనగా నాశములేదనియు ఆత్మ భిన్నదృశ్యమంతయు మార్పు చెందును నశించును గనుక అనిత్యమని సందేహంలేకుండా నిశ్చయించుటయే నిత్యానిత్యవివేకము.

శ్లో॥ సదైవవాస నాత్యాగః, శమోఽయమితిశబ్దితః।
నిగ్రహోబాహ్యవృత్తీనాం దమఇత్యభిధీయతే॥ ౬

తాత్పర్య వివరణం.

శమము, దమము, తితిక్షాఉపరతి శ్రద్ధా సమాధానములను శమాదిషట్కమును అనగా ఆరింటిని చెప్పబోవుచు ఈ శ్లోకంలో శమదమములను చెప్పుచున్నారు.

సర్వకాలములయందు, పూర్వవాసనలను విడిచిపెట్టవలయును. వాసనలనగా,అనేకవిషయములను గుర్తుచేయు సంస్కారములే ఏవిషయములను గుర్తుకు తెచ్చుకోకుండా ఆ సంస్కారములను వదలుటే శమము, అనగా అంతరింద్రియ నిగ్రహమని యర్థము. నేత్రములు శ్రోత్రములు మొదలగు ఇంద్రియములను నిషిద్ధమగు విషయముల మీదికి పోకుండా చేయుట, దమము అనగా బహిరింద్రియ నిగ్రహమని యర్థము.

శ్లో॥ విషయేభ్యః పరావృత్తిః పరమోపరతిర్హిసా,
సహనం సర్వదుఃఖానాం తితిక్షాసాశుభామతా॥ ౭

తాత్పర్య వివరణం.

భోగ్యములగు శబ్దస్పర్శాది విషయములను అనుభవించవలయు ననే ఇచ్ఛ లేకుండా వుండుటయే ఉపరతి యనబడును. సర్వకర్మ సన్యాసమే, ఉపరతియని కూడా చెప్పెదరు. దుఃఖములు దుఃఖసాధనములు. చలి, వేడి, మొదలగునవి తటస్థించినపుడు. సహనం అనగా ఇవి పోయే ఉపాయమేమని ఆందోళన పడకుండా ఓర్చుకొని యుండుటయో తితిక్ష యనబడును. దీనిని ద్వంద్వ సహనమని కూడా యందురు. ఈ తితిక్ష చాలా ముఖ్యసాధనమని పెద్దలు చెప్పెదరు.

శ్లో॥ నిగమాచార్యవాక్యేషు భక్తిః శ్రద్ధేతివిశ్రుతా।
చిత్తైకాగ్ర్యంతు సల్లక్ష్యే సమాధాన మితిస్మృతం॥ ౮

తాత్పర్య వివరణం

వేదవాక్యములయందు గురువులు చెప్పే తత్త్వబోధక వాక్యముల యందును విశ్వాసము కలిగియుండుటయే శ్రద్ధా. అనగా ఈవిధముగా చేసిన తప్పక ఫలం కలుగునని నిశ్చయం. వేదాంత వాక్యములకు లక్ష్యమైన పరమాత్మయందు మనస్సును ఏకాగ్రతగా నిలుపుట సమాధానం ఇదియే చిత్త సమాధాన మనబడును.

శ్లో॥ సంసారబంధనిర్ముక్తిః కథంమేస్యాత్కదావిధే।
ఇతియాసుదృఢాబుద్ధిర్వక్తవ్యాసాముముక్షుతా॥ ౯

తాత్పర్య వివరణం,

శమాధి షట్కసంపత్తిని చెప్పి ముముక్షుత్వమును చెప్పుచున్నారు.

ఈ అజ్ఞాన కల్పితమైన జననమరణ సుఖదుఃఖ కర్తృత్వ భోక్తృత్వ సంసారబంధము యెపుడు తొలగిపోవును. స్వామియని భగవంతుని ప్రార్థిస్తూ బంధమునుండి బయటపడవలయుననే దృఢనిశ్చయమే ముముక్షుత్వము.

శ్లో॥ ఉక్తసాధన యుక్తేన విచారః పురుషేణహి।
కర్తవ్యోజ్ఞాన సిద్ధ్యర్థమాత్మనశ్శుభామిచ్ఛతా॥ ౧౦

తాత్పర్య వివరణం.

పైన చెప్పిన సాధన చతుష్టయము కలిగిన పురుషుడు తనకు పరమ శుభము మోక్షమే. అట్టి మోక్షమునకు ఆత్మజ్ఞానమే సాధనము. అట్టి ఆత్మజ్ఞానముకొరకు ఆత్మానాత్మ విచారము అనగా వేదాంత విచారము తప్పక చేయవలయునని తాత్పర్యము.

శ్లో॥ నోత్పద్యతే వినాజ్ఞానం విచారేణాన్య సాధనైః।
యథాపదార్థ భానంహి ప్రకాశేనవినా క్వచిత్॥ ౧౧

తాత్పర్య వివరణం.

మోక్షమునకు సాధనమైన ఆత్మజ్ఞానము శ్రవణమననములనే బ్రహ్మవిచారం లేకుండా కర్మలు ఉపాసనలనే సాధనమువలన కలుగదు. కర్మలు ఉపాసనలు అంతఃకరణ శుద్ధికి సాధనములు కావచ్చును. బ్రహ్మ విచారమే జ్ఞానమునకు సాధనం. ఎట్లనగా సూర్యునివెల్తురు దీపము వెల్తురు మొదలగు ప్రకాశలేకుండా ఏవస్తువులు యెట్లు కనిపించవో అటులనే బ్రహ్మవిచారము లేకుండా బ్రహ్మజ్ఞానం కలుగదని తాత్పర్యము.

శ్లో॥ కో౽హంకథమిదం జాతం కో వైకర్తాస్య విద్యతే।
ఉపాదానం కిమస్తీహ విచారస్సోయమిదృశః॥ ౧౨

తాత్పర్య వివరణం

విచారమనగా నేమి? నేను కర్తను భోక్తను సుఖము ననుభవించు చున్నాను అనే అనుభవములో గోచరించు అనగా ఇట్లు అనుకునే నేను యెవరు? దాని స్వరూపమేమి? ఈ ప్రపంచము దేనివల్ల పుట్టినది? ఎట్లు పుట్టినది? ఈ ప్రపంచమును సృష్టించిన కర్తయెవరయినా ఉన్నారా? జగత్తుకు జీవునికర్మ కారణమా లేక ఈశ్వరుడు కారణమా? మరియొకటియా. కుండలు మొదలగు వికారములకు మట్టి మొదలగు ఉపాదాన కారణము లున్నట్లు ఈ ప్రపంచమునకు ఉపాదాన కారణమేమైన యున్నదాయని ప్రమాణములతోను యుక్తులతోను విమర్శించుటయే విచారమనబడును. ఇట్టి విచారమే జ్ఞానసాధనం.

శ్లో॥నాహంభూత గణోదేహో నాహంచాక్షగణ స్తథా॥
ఏతద్విలక్షణః కశ్చిద్విచారస్సోయమీ దృశః॥ ౧౩

తాత్పర్య వివరణం

చార్వాకులు, పృథివి, జలం, తేజస్సు, వాయువు ఈనాల్గుభూతముల వలన తయారైన చైతన్యముతో కూడిన శరీరమే ఆత్మకాని వేరులేదంటారు అదేగాక, నేను లావుగా నున్నాను ,సన్నగా నున్నాను, అని శరీరమునే ఆత్మగా వ్యవహరిస్తున్నట్లు కనిపిస్తూన్నది. అది కాదని చెప్పు చున్నారు. నేను నాలుగు భూతములవలన పుట్టిన శరీర స్వరూపుడను కాదు. శరీరము దృశ్యమైనది. భౌతికముకూడా నాశరీరమంటున్నాను కూడా. అందుచేత నేను శరీరంకంటే వేరుగా నున్నానని విచారించవలయును.

చార్వాకులలో ఒక తెగవారు నేను చూస్తున్నాను, నేను వింటు న్నాను అనే అనుభవమునుబట్టి ఇంద్రియములే ఆత్మగాని వేరు లేదం టారు. అదీ పొరపాటే. ఇంద్రియములుకూడా భౌతికములేగనుక నా కళ్ళు, నా చెవులు అని అంటున్నాను గనుక నేను ఇంద్రియములకంటే వేరు, నా మనస్సు, నా ప్రాణము అనుచున్నానుగనుక, మనస్సుకంటే. ప్రాణముకంటేకూడా నేను వేరు అయితే ఏమి నీవుకాకపోతే శూన్య స్వరూపుడవా అంటే శూన్యస్వరూపుడను కాదు. ఈ శరీరేంద్రియాది సంఘాతముకంటే అతీతమైన వీటిని తెలుసుకునే చేతన స్వరూపుడనని విమర్శించుటయే విచారము.

శ్లో॥ అజ్ఞాన ప్రభవం సర్వం జ్ఞానేన ప్రవిలీయతే।
సంకల్పో వివిధః కర్తా విచారస్సోఽయమీ దృశః॥ ౧౪

తాత్పర్య వివరణం.

నేనెవరు? అనే అంశను విచారించి, జగత్తుదేనివలన, ఎట్లు పుట్టు చున్నదనే విషయమును చెప్పుచున్నారు.

పరమాణువుల వలననే జగత్తు పుట్టుచున్నదని తార్కికులు చెప్పె దరు. మూలప్రకృతివలననే జగత్తు పుట్టుచున్నదని సాంఖ్యులు చెప్పె దరు ఆ మతములను ఆశ్రయించ కూడదు. పరమాత్మ జ్ఞానమువల్లనే జీవత్వము పోవునని, జగత్తు నశించునని ఉపనిషత్తులు చెప్పుచున్నవి గనుక. ఆత్మను ఆవరించిన అజ్ఞానమువలననే భ్రాంతిరూపముగా జగత్తు పుట్టుచున్నది గనుకనే. వెల్తురుచేత చీకటి నశించినట్లు, శుక్తిజ్ఞానముచేత రజతభ్రమ నశించినట్లు, ఆత్మజ్ఞానముచేత భ్రమసిద్ధమైన జగత్తు నశిం చును, అని విచారించవలయును. ప్రపంచమునకు కర్త యేదనగా అనేక

విధములయిన మనస్సుయొక్క పరిణామమైన సంకల్పమే ఈ విధముగా చేయు విమర్శయే విచారము.

శ్లో॥ ఏతయోర్య దుపాదాన మేకం సూక్ష్మం సదవ్యయం।
యథైవమృద్ఘటాదీనాం విచారస్సోఽయమీదృశః॥ ౧౫

తాత్పర్య వివరణం.

ఈ జగత్తుకుఉపాదానకారణమేమంటే, అజ్ఞానమునకు, సంకల్పము నకుకూడా ఉపాదానం అన్నమాటయే. అట్టి ఉపాదానం పరమాత్మయే. ఉపాదానమనగా అధిష్ఠానం. ఈ అధిష్ఠానమే అజ్ఞానంవలె తత్కార్య మైన ప్రపంచంవలె గోచరించుచున్నదనే విషయం అనేకచోట్ల చెప్పిన విషయమే. అట్టి అధిష్ఠానమైన పరబ్రహ్మతత్వము గడచిన, గడచుచున్న, గడవబోయే మూడుకాలములయందు నశించేదికాదు. జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షీయతే, నశ్యతి, అనే, అనగా పుట్టుచున్నది. వున్నది. వృద్ధిని పొందుచున్నది. తగ్గుటకు మార్పును చెందుచున్నది, తగ్గి పోవుచున్నది. నశించుచున్నది అను ఆరు భావవికారములు లేనిది. మన స్సుకు. ఇంద్రియములకు తెలియనిది. జాతి క్రియాగుణములు లేనిది, కేవల జ్ఞానరూపము. ఇట్టి పరమాత్మయే మట్టి, కుండ మొదలగు వికారములకు ఉపాదానకారమైనట్లు జగత్తుకు ఉపాదానకారణం. దీనినిబట్టి మట్టికంటే ఘటాదివికారములు వేరులేనట్లు పరమాత్మకంటే జగత్తు వేరులేదని తెలు చున్నది. ఇట్టి విమర్శయే విచారము.

శ్లో॥ అహ మేకోఽపి సూక్ష్మశ్చ జ్ఞాతాసాక్షీ సదవ్యయః।
తదహం నాత్ర సందేహో విచారస్సోఽయమీదృశః॥ ౧౬

తాత్పర్య వివరణం.

నేను పరమాత్మ స్వరూపుడను, అద్వితీయుడను, సజాతీయ విజాతీయ స్వగతభేదము లేనివాడను, మనస్సుకు, ఇంద్రియములకు గోచరం కానివాడను, అహంకారము మొదలగు దృశ్యములను తెలుసుకున్నే చేతనుడను, ఇంద్రియ సంబంధం లేకుండాకూడా స్వప్నప్రపంచమును, మనోవృత్తులను తెలుసుకునే సాక్షిని, గనుకనే ఏ వికారములు లేనివాడను. సచ్చిదానంద స్వరూపుడనని విమర్శించుటయే విచారము.

శ్లో॥ ఆత్మా వినిష్కలో హ్యేకో దేహో బహుభిరావృతః।
తయోరైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞానమతః పరం॥ ౧౩

తాత్పర్య వివరణం.

ఈ శ్లోకము మొదలు అయిదు శ్లోకములవరకు అజ్ఞాన స్వరూపమును చెప్పుచు, జీవబ్రహ్మైక్యమును దృఢపరచుచున్నారు.

నేను అనే ప్రతీతిలో గోచరించుచు, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మారినను, ఆత్మ మారకుండా తెలుసుకుంటూవుండే సత్యజ్ఞానానంద స్వరూపము, అవయవములు లేనిది ఒకటియే. అద్వితీయము. దేహము అనగా లింగదేహము. శ్రోత్రము. త్వగింద్రియము, నేత్రము, రసనేంద్రియము, ఘ్రాణేంద్రియము. అను జ్ఞానేంద్రియములు 5. వాక్పాణి పాద పాయూపస్థలనే కర్మేంద్రియములు 5. ప్రాణాపాన వ్యానోదాన సమానములను వాయువులు 5. మనో బుద్ధులు 2. ఈ పదిహేడుతో కూడినది లింగదేహము. ఇంత తేరాలో నున్న ఆత్మకు, లింగదేహమునకు, నేను చూస్తున్నాను, వింటున్నాను. నేను నడుస్తూన్నాను. నేను ఆలోచిస్తున్నాను. అని ఐక్యముగా వ్యవహరించుచున్నాము. ఇదంతయు

రెంటికి తేడా తెలియని తాదాత్మ్య భ్రమ వలన నేర్పడినదే. ఇంతకన్న అజ్ఞాన మేమున్నది? ఇదియే అజ్ఞానమని గుర్తింపవలయును.

శ్లో॥ ఆత్మా నియామ కశ్చాన్తర్దేహో బాహ్యోనియమ్యకః।
తయోరైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞాన మతః పరం॥ ౧౭

తాత్పర్య వివరణం.

ఆత్మ జ్ఞానస్వరూపము నియమించునది, పంచకోశముల లోపల నున్నది, దేహము బైటనున్నట్లు కనిపించునది, ఆత్మ చేత నియమింప బడునది, ఇంత తేడాతోనున్న ఆత్మ దేహములకు భేదమును తెలుసుకొనలేక దేహమునే నేనని వ్యవహరించుచున్నారు. ఇదంతయు భ్రమవలననే, ఇంతకంటే అజ్ఞాన మేమున్నది? ఇదియే అజ్ఞానము.

శ్లో॥ ఆత్మా జ్ఞానమయః పుణ్యోదేహో మాంసమయోఽ శుచిః
తయోరైక్యం ప్రపశ్యన్తికి మజ్ఞాన మతః పరం॥ ౧౯

తాత్పర్య వివరణం.

ఆత్మ జ్ఞానస్వరూపము, స్వప్రకాశము, ఏవిధమైన మాలిన్యము లేకుండా శుద్ధముగానున్నది. దేహము మాంసవికారమైనది. అందువలననే అపరిశుద్ధమైనది ఇట్టి స్థూలదేహమునుకూడా నేను లావుగానున్నాను నేను సన్నముగా నున్నానని తేడాలేకుండా వాడుచున్నారు. అంతయు భ్రమవలన నేర్పడినదే. ఇదియే అజ్ఞానమని గ్రహించవలయును.

శ్లో॥ ఆత్మా ప్రకాశకస్స్వచ్ఛో దేహస్తామస ఉచ్యతే।
తయో రైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞాన మతం॰ పరం॥ ౨౦

తాత్పర్య వివరణం.

సూర్యుడు, దీపము మొదలగు స్వప్రకాశములు. ఇతరమైన వెల్తురు ఇతరాపేక్ష లేకుండా ఎట్లు ప్రకాశించునో, ఇతరములను ప్రకాశింపచేయు చున్నవో. ఆత్మకూడా ఇంద్రియాదుల అపేక్షలేకుండా సర్వావస్థలయందు స్వయంప్రకాశమానమై ఇతరములను తెలియచేయుచుండును. ఘటాదుల వలె దేహము జడపదార్థము, ఈ రెంటిని నేను నేనని అభేదముగా భ్రమతో వ్యవహరించుచున్నారు. ఇదియే అజ్ఞానము. ఇంతకన్న అజ్ఞాన మేమున్నది ?

శ్లో॥ ఆత్మా నిత్యోహి సద్రూపో దేహోఽనిత్యోహ్యసన్మయః
తయోరైక్యం ప్రపశ్యన్తి కిమజ్ఞాన మతః పరం॥ ౨౧

తాత్పర్య వివరణం.

దురవగాహమైన ఆత్మానాత్మ విచారములో చెప్పిన విషయం చెప్పి నను పునరుక్తియని అనుకొనకూడదు. జీవులయందు అతి దయతో శంకరాచార్యులవారు అనేకవిధములుగా ఆత్మానాత్మలకు తేడా చూపించు చున్నారు ఆత్మ నిత్యము అనగా నాశనములేనిది, త్రికాలములయందును మార్పులేనిది. దేహము నశించునది. అయా సమయములయందు మార్పును చెందునది. ఇట్టి ఆత్మకు, దేహమునకు ఐక్యమును వ్యవహరి స్తున్నారంటే ఇంతకంటే భ్రమ యేమున్నది? ఈ భ్రమయే అజ్ఞానము.

శ్లో॥ ఆత్మనస్తత్ప్రకాశత్వం యత్పదార్థావభాసనం।
నాగ్న్యాది దీప్తివద్దీప్తి ర్భవత్యాన్ధ్యం యతోనిశి॥ ౨౨

తాత్పర్య వివరణం.

ఆత్మ ప్రకాశ రూపముగా అన్నిటిని ప్రకాశింపచేయును. అనగా

ఆత్మ జ్ఞాన స్వరూపము. దానినే దృక్ అందురు. ప్రపంచమంతయు జ్ఞేయము. దీనినే దృశ్య మందురు. ఇట్టి దృశ్యమును దృక్కు అగు ఆత్మ జ్యోతిస్సుచేతనే తెలియబడుచున్నది. అన్ని అవస్థలయందు, అన్ని సమయములయందును. ఆత్మయనే జ్ఞానమునకు లోపములేదు. జాగ్రదవస్థ యందు అపుడున్న ప్రపంచమును తెలుసుకుంటున్నాము. స్వప్నదశ యందు అప్పుడున్న స్వప్నదృశ్యములనే తెలుసుకుంటున్నాము, సుషుప్త్యవస్థయందును అపుడున్న అజ్ఞానమును, ఆనందమును తెలుసుకుంటున్నాము. వెల్తురుంటే వెల్తుర్ను తెలుసుకుంటున్నాము. చీకటివుంటే చీకటినే తెలుసుకుంటున్నాము. తెలిస్తే తెలుసునని అంతఃకరణ వృత్తియనే జ్ఞానమును తెలుసుకుంటున్నాము. తెలియకపోతే తెలియలేదని, అజ్ఞానమునే తెలుసుకుంటున్నాము. అన్నింటిని ఆయా సమయములయందు దృక్కు అనే ఆత్మ చేతనే తెలుసుకుంటున్నాము. గనుక ఆత్మ ప్రకాశ రూపమని విచారించినయడల అందరికిని అనుభవసిద్ధమైన విషయమే.

ఆత్మ దీప్తి సూర్యుని వెల్తురు, అగ్నిదీపముల వెల్తురువంటిది కాదు. సూర్యుని వెల్తురు రాత్రికాలమందుండదు. అగ్ని దీపముల వెల్తుర్లు రాత్రి కాలమందున్నను కొన్నిచోట్ల వుంటున్నవి. కొన్నిచోట్ల వుండవు. కొన్ని చోట్ల చీకటే వుంటుంది. ఆత్మ దీప్తిలో అనగా జ్ఞానంలో చీకటి వున్న చోట చీకటి కనిపిస్తుంది. వెల్తురున్న చోట వెల్తురు కనిపిస్తుంది. ఆత్మ దీప్తిలోనే సర్వము తెలియబడుచున్నది. ఏవస్తువును చూచినను ఆత్మ దీప్తిలో నుండి ఆత్మదీప్తిలోనే కనిపించుచున్నది. ఆత్మదీప్తిలేని దేశము కాని, కాలముగాని, వస్తువుగాని లేవు గనుక స్వప్రకాశమగు సూర్యాదులనుకూడా ప్రకాశింపచేయు ఆత్మప్రకాశ స్వరూపము విలక్షణమని గ్రహించవలసిన విషయము.

శ్లో॥ దేహోఽహమిత్యయం మూఢో ధృత్వాతిష్ఠత్యహో జనః॥
మమాయ మిత్యపిజ్ఞాత్వా ఘటద్రష్టేవ సర్వదా॥ ౯౬

తాత్పర్య వివరణము.

పరమాత్మ స్వరూపుడైన జీవుడు తను ద్రష్ట అయియుండి, దృశ్యమైన దేహమును నేను మనుష్యుడను అని, మనుష్యత్వ ధర్మములోకూడిన దేహముతో ఐక్యభ్రమను పొందుచున్నాడు. అందులోకూడా ఆశ్చర్యమేమంటే, నా ఘటము, నా యిల్లు అనుకునేవాడు నేనే ఘటమును, నేనే యిల్లు అని ఎవ్వడు అనుకోడు. కాని జీవుడు నా దేహమని దేహముకంటే తను వేరుగా నున్నటుల వ్యవహరించుచుకూడా నేను మనుష్యుడను, లావుగా నున్నాను అని లావు మనుష్యత్వముగల దేహమే నేను అని భ్రమపడుతున్నాడంటే యింతకంటే అజ్ఞానం వేరేయున్నదా యని తాత్పర్యము.

శ్లో॥ బ్రహ్మై వాహం సమశ్శాన్తః సచ్చిదానంద లక్షణః॥
నాహం దేహోహ్య సద్రూపో జ్ఞాన మిత్యుచ్యతే బుధైః

తాత్పర్య వివరణం.

మహావాక్యలక్ష్యమైన ఆత్మజ్ఞానమే జ్ఞానము. ఇట్టి జ్ఞానస్వరూపమును అయిదు శ్లోకములతో చెప్పుచున్నారు. త్వం పదార్థమైన జీవుడు తత్పదార్థమైన ఈశ్వరుడు ఇద్దరు అంతఃకరణను, మాయను విడిచిపెడితే ఏకరూపులే. ఆ విషయమునే ఈ శ్లోకములో చెప్పిరి. నేను సర్వవికార రహితమైన, సమమైన, సచ్చిదానందరూపమైన బ్రహ్మస్వరూపుడనేకాని అనిత్యమైన దృశ్యమైన దేహస్వరూపుడను కాదని తెలుసుకొనుటయే జ్ఞానము ఒక విశేషము ఆత్మను బోధించుట రెండువిధములు. విధి

రూపముగా స్వరూపమును చెప్పుట. రెండు. ఆరోపమును నిషేధించుచు ఆత్మను బోధించుట. ఈశ్లోకంలో సచ్చిదానంద లక్షణః అని బ్రహ్మ స్వరూపము చెప్పబడినది. నాహం దేహః అని ఆరోపితమగు దేహేంద్రియ సంఘాత స్వరూపుడను కానని నిషేధరూపముగా కూడా చెప్పబడినదని గ్రహించవచ్చును.

శ్లో॥ నిర్వికారో నిరాకారో నిరవద్యోఽహ మవ్యయః।
నాహం దేహోహ్య సద్రూపో జ్ఞాన మిత్యుచ్యతే బుధైః

తాత్పర్య వివరణం.

నేను జన్మ, మరణము అనే వికారములు లేనివాడను. కారణ మేమంటే. శరీరేంద్రియములనే ఆకారము లేనివాడను. ఆకారము లేదు గనుకనే తాపత్రయము లేనివాడను. అపక్షయము, నాశము లేనివాడను. నశించు శరీరస్వరూపుడను కాదు అని పరమాత్మను తెలుసుకొనుటయే. అనగా అఖండ బ్రహ్మాకారవృత్తియను సాక్షాత్కారమే జ్ఞాన మనబడును.

శ్లో॥ నిరామయో నిరాభాసో నిర్వికల్పోఽహమా తతః।
నాహం దేహోహ్య సద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

తాత్పర్య వివరణం.

ఏ రోగము లేనివాడను, స్వప్రకాశస్వరూపుడను గనుక దేనిచేతను తెలియచేయబడను. సర్వకల్పనా రహితుడను. అనగా ఆరోపము అధిష్ఠానమునకు అంటదు. గనుక కల్పనా రహితుడను. దేహాది స్వరూపుడను కాదు. సచ్చిదానంద స్వరూపుడనేయని తెలుసుకొనుటయే జ్ఞానమనబడును.

శ్లో॥ నిర్గుణో నిష్క్రియో నిత్యో నిత్యముక్తోఽహమచ్యుతః।
నాహం దేహోహ్య సద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

తాత్పర్య వివరణం.

ఏ గుణములు లేనివాడను, క్రియలు లేనివాడను, నాశము లేని వాడను, ఏ బంధము లేనివాడను, మార్పులేని సచ్చిదానంద స్వరూపుడనే యని తెలుసుకొనుటయే జ్ఞానం.

శ్లో॥ నిర్మలో నిశ్చలోఽనన్తః శుద్ధోఽహమజరోఽమరః।
నాహం దేహోహ్య సద్రూపో జ్ఞానమిత్యుచ్యతే బుధైః॥

తాత్పర్య వివరణం.

నేను అజ్ఞానము, అజ్ఞానకార్యములగు భ్రమలు అనే మాలిన్యము లేనివాడను. ఆకాశాదులవలె చలనములేనివాడను, దేశ కాల వస్తు పరిచ్ఛేదములు లేనివాడను, అపరిశుద్ధత లేనివాడను, ముసలితనం లేని వాడను, మరణం లేనివాడను, ఇవి యన్నియు స్థూల, సూక్ష్మ కారణదేహములకు సంబంధించినవి గనుక దేహత్రయము లేని నాకు ఇవి ఏమియు లేవు. సచ్చిదానంద స్వరూపుడనే యని తెలుసుకొనుటయే జ్ఞాన మన బడును.

శ్లో॥ స్వదేహే శోభనం సంతం పురుషాఖ్యంచ సమ్మతం।
కిం మూర్ఖ శూన్య మాత్మానం దేహాతీతం కరోషిభోః॥

తాత్పర్య వివరణం.

ఆత్మ శరీరము, ఇంద్రియములు ఏవీ కానపుడు శూన్యమేకదా యని

శూన్యవాదియగు బౌద్ధుడు అంటాడు గనుక వానికి సమాధానముగా చెప్పుచున్నారు.

నేను నేనని మనుష్య శరీరంలో మంగళరూపముగా అన్నిటికి ద్రష్టగా అందరి అనుభవంలో గోచరిస్తున్నది. ఉపనిషత్తులుకూడా జీవుడు బ్రహ్మస్వరూపుడని చెప్పుచున్నవి. దేహంకంటే వేరుగా సర్వకాలముల యందు సర్వసాక్షిగానున్న ఆత్మను శూన్యమని ఎట్లా అంటావు? శూన్యమును గుర్తించేది ఆత్మ కాదా ! ఓ మూర్ఖుడా! యెంత అవివేకంలో పడ్డావురా ! మార్చుకొనమని తాత్పర్యం.

శ్లో॥ స్వాత్మానంశృణు మూర్ఖత్వం, శ్రుత్యాయుక్త్యాచ పూరుషం,
దేహాతీతంసదాకారం సుదుర్దర్శంభవాదృశైః॥ 30

తాత్పర్య వివరణం.

అంతా శూన్యమంటే శూన్యవాదికూడా శూన్యం కావలసివచ్చును. అందువలన దేహమే ఆత్మయని చార్వాకులందురు. అట్టి చార్వాకునికి సమాధానం చెప్పుచున్నారు.

పంచకోశములకంటే ఆత్మ వేరుగానున్నదని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. యుక్తికూడా యున్నది. నేత్రము, రూపము మొదలగుపదార్థములను చూచుచున్నది. చూడబడే రూపాదులకంటే వేరుగానున్నది. ఆ నేత్రేంద్రియము కనిపించకపోయినను లేదనుటకు వీలులేదు. అదిలేకపోతే ఇవి కనిపించవుకదా, అటులనే చూడబడే అనగా తెలియబడే దేహాదులకంటే తెలుసుకున్నే ఆత్మ వేరేయున్నాడని చెప్పకతప్పదు.

ఆయనలేకపోతే ఇవి ఎట్లుతెలియబడును ? అందుచేత తెలియబడక పోయినను లేదనిచెప్పుటకు వీలులేదు. అదిగాక దృశ్యమయితే ఎందుకు కనిపించదని అడుగవలెనుగాని, ద్రష్ట అయినపుడు దృశ్యములవలె యెట్లా కనిపిస్తాడు రా మూర్ఖుడా ? దేహాదులకంటే వేరుగానున్నాడు. (అస్తి) వున్నదియని స్వరూపముగా గోచరిస్తున్నాడు. సర్వమును తెలుసుకున్నే వాడు గనుక నీలాంటివాళ్ళకు దృశ్యమువలె తెలియబడుటలేదని అంత మాత్రంతో ఆత్మ వేరే లేదంటావా ఇంతకన్నా మూర్ఖమున్నదాయని అభిప్రాయము.

శ్లో॥ అహం శబ్దేన విఖ్యాతః, ఏక ఏవస్థిత పరః
స్థూల స్త్వనేకతాంప్రాప్తః కథంస్యాద్దేహకః పుమాన్॥

తాత్పర్య వివరణం.

నేననే శబ్దముచేత ఆత్మ ప్రసిద్ధముగా నున్నది. ఒకటియైన దేహాదులకంటే వేరుగా నున్నది. దేహము స్థూలముగా అనేక భూతములతో తయారై అనేకాకారములుగా నున్నది. ఈవిధముగా చీకటికి వెలుతురుకు తేడావున్నట్లు దేహమునకు ఆత్మకు తేడాకనిపిస్తుంటే దేహమే ఆత్మయని యెట్లా అంటావు? అనకూడదని తాత్పర్యము.

శ్లో॥ అహం ద్రష్టృతయా సిద్ధో, దేహో దృశ్యతయాస్థితః
మమాయమితి నిర్దేశాత్కథంస్యాద్దేహకః పుమాన్॥ 32

తాత్పర్య వివరణం.

నేను రూపమును చూస్తున్నాను, శబ్దములు వింటున్నాను అన్నిటిని తెలుసుకొనుచున్నానని. ద్రష్టగా అనుభవసిద్ధమయి యున్నాను, దేహము

ఘటాదులవలె దృశ్యముగా తెలియబడుచున్నది. ఇదియేగాక నా యిల్లు నాధనం అంటూ ఇంటికంటే ధనముకంటే యెట్లు వేరుగానున్నాడో అటు లనే ఇది నాదేహమంటూ, దేహముకంటే వేరుగానున్న ఆత్మ దేహ స్వరూపు డెట్లాఅగును ? కాడు.

శ్లో॥ అహం వికారహీనస్తు దేహోనిత్యం వికారవాన్।
ఇతి ప్రతీయతే సాక్షాత్కథంస్యా ద్దేహకః పుమాన్ ॥33॥

తాత్పర్య వివరణం.

నేను పుట్టుట పెరుగుట మొదలగు ఆరు వికారములు లేనివాడను, దేహము పుట్టుట, పెరుగుట మొదలగు షడ్భావవికారములు కలదిగా అందరికి అనుభవసిద్ధమైయున్నది. అందువలన ఆత్మ దేహస్వరూపుడు ఎట్లా అగును ? కాడు.

శ్లో॥ యస్మాత్పర మితిశ్రుత్యా తయా పురుషలక్షణం
వినిర్ణీతం విమూఢేన కథంస్యా ద్దేహకః పుమాన్ ॥34॥

తాత్పర్య వివరణం.

ఇంతవరకు అనుభవముచేత యుక్తిచేత దేహాదులకంటే ఆత్మ వేరుగా నున్నదనిచెప్పి, ఇప్పుడు పరమప్రమాణమైన వేదముకూడా అన్నిటికంటే ఆత్మ అతీతముగా నున్నదని చెప్పుచున్నదని కొన్ని శ్లోకములతో చెప్పు చున్నారు.

ఆత్మ సర్వత్రా నిండియున్నది. పురుషుడనగా పూర్ణమని అర్థము, అట్టి ఆత్మకంటే గొప్పదిగాని కొద్దిదిగాని ఏమియు వేరుగాలేవు. అట్టిఆత్మ

స్వస్వరూపమునందేయున్నదని ఆత్మకులక్షణంతైత్తిరీయశ్రుతి చెప్పుచున్నది, ఇట్టి లక్షణము విమూఢేన నిర్ణీతం, విమూఢుడనగా విగతమూఢత్వము కలవాడు, అనగా వివేకవంతుడని అర్థము. అట్టి వివేకవంతునిచేతకూడా నిర్ణయింపబడినది గనుక ఆత్మ దేహస్వరూపముకాదని తాత్పర్యము.

శ్లో॥ సర్వం పురుషఏవేతి సూక్తే పురుషసంజ్ఞితే
అప్యుచ్యతే యతశ్శ్రుత్యా కథంస్యాద్దేహకఃపుమాన్ ॥

తాత్పర్య వివరణం.

పురుషసూక్తములోకూడా (గడిచినది) భూతభవిష్యత్కాలముల యందున్న సర్వప్రపంచము పురుష స్వరూపమే అనగా ఆత్మ స్వరూపమే నని పురుషలక్షణం చెప్పుచున్నది. అట్టి ఆత్మ దేహము ఎట్లగును ?

శ్లో॥ అసంగః పురుషః ప్రోక్తో బృహదారణ్యకేఽపిచ।
అనంత మలసంశ్లిష్టః కథంస్యాద్దేహకః పుమాన్ ॥3౭

తాత్పర్య వివరణం.

వాజసనేయశాఖలోని బృహదారణ్యకోపనిషత్తుకూడా పురుషుడు అసంగస్వరూపుడు దేనిని అంటనివాడు, అనగా ఆరోపితమగు నామరూప ప్రపంచము. అధిష్ఠానమగు సచ్చిదానందరూపమైన ఆత్మకు అంటదని పరమార్థము. ఈవిధముగా చెప్పుచున్నది. మలమూత్ర మాంసాదులనే మాలిన్యములతోకూడిన దేహస్వరూపుడు ఆత్మ ఎట్లా అగును ?

శ్లో॥ తత్రైవ చ సమాఖ్యాతః స్వయంజ్యోతిర్హి పురుషః।
జడః పరప్రకాశ్యోఽసౌ కథంస్యాద్దేహకః పుమాన్ ॥3౮

తాత్పర్య వివరణం.

బృహదారణ్యకోపనిషత్తే స్వయంజ్యోతిస్స్వరూపుడు ఆత్మయని అనగా ఇంద్రియములు పనిచేయని స్వప్నావస్థయందుకూడా స్వప్నప్రపంచమును ప్రకాశింపచేయుచున్నాడు. ఇట్టి ఆత్మ ఘటాదులవలె దృశ్యమగు శరీరం ఎట్లా అగును? అని చెప్పుచున్నది.

శ్లో॥ ప్రోక్తోఽపికర్మకాండేన హ్యాత్మా దేహా ద్విలక్షణః।
నిత్యశ్చ తత్ఫలంభుంక్తే దేహపాతా దనంతరం ॥౩౭

తాత్పర్య వివరణం.

కర్మకాండలోకూడా ఆత్మ దేహముకాదు వేరుగానున్నదని చెప్పవలయును. బ్రతికియున్నంతవరకు అగ్నిహోత్రాదులు సంధ్యావందనము మొదలగువారివారికి చెప్పబడిన కర్మలనుచేసితీరవలయునని వేదశాస్త్రములు చెప్పుచున్నవి. దేహమే ఆత్మఅయితే దేహంపడిపోతే తర్వాత ఈ కర్మఫలములను అనుభవించే వాడెవడు ? ఆ ఫలం వ్యర్థమయివా మరిఒకరికి పోయినను చేయడం వ్యర్థంకదా. అందుచేత ఆత్మ దేహముకాదు వేరుగానున్నది గనుక ఈ దేహం పడిపోయినను ఇతరలోకములయందు మరియొక దేహమునుపొంది ఈ కర్మఫలమును అనుభవించును గనుక ఆత్మ దేహము కాదు వేరుగానున్నదని గ్రహించవలయునని యర్థము.

శ్లో॥ లింగంచానేక సంయుక్తం చలం దృశ్యం వికారిచ।
అవ్యాపక మసద్రూపం కథంస్యా ద్దేహకః పుమాన్ : ॥౩౮

తాత్పర్య వివరణం.

ఆత్మ స్థూలశరీర స్వరూపముకాదు, లింగశరీర స్వరూపుడుకూడా

కాదు. లింగశరీరమనగా అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు. అయిదు ప్రాణాది వాయువులు. మనస్సు, బుద్ధి ఈ పదిహేడింటి సముదాయమే స్థూలదేహ సంబంధము కలదికూడా. చంచలమైనది. నానేత్రములు, నాచెవులు, నామనస్సు అని దృశ్యముగా తెలియబడుచున్నది. వ్యాపకమైనది కాదు అల్పమయినది మార్పును చెందునది ఆత్మ జ్ఞానముచేత నశించునది గనుక ఆత్మ లింగదేహస్వరూపం కాదు. కారణదేహమైన అజ్ఞాన స్వరూపంకూడా కాదు. (స్థూల సూక్ష్మ కారణ శరీరములకంటే కూడా అతీతుడనని తెలుసుకొనవలయును.)

శ్లో॥ ఏవం దేహద్వయాదన్య ఆత్మపూరుష ఈశ్వరః।
సర్వాత్మా సర్వరూపశ్చ సర్వాతీతోఽ హమవ్యయః ॥40

తాత్పర్య వివరణం.

స్థూలసూక్ష్మ దేహములకంటే అతీతుడను. దేహములకు ప్రేరకుడను, జీవుడనుకాదు. ఈశ్వరస్వరూపుడను, సర్వమునకుఆత్మస్వరూపుడను, నాయందే అంతయు కల్పితమైనది గనుక సర్వము నాస్వరూపమే నేను సర్వాతీతుడను అనగా ఈ దృశ్యస్వరూపం నాదికాదు. దృశ్యముకంటే నేను వేరు. అధిష్ఠానముకంటే ఆరోపము వేరు కాదు గనుక నాకంటే ఇది వేరు కాదు, స్వప్రకాశ స్వరూపుడను, సాక్షిని అని గ్రహించవలయును.

శ్లో॥ ఇత్యాత్మ దేహభాగేన ప్రపంచస్యైవ సత్యతా।
యథోక్తా తర్కశాస్త్రేణ తతః కింపురుషార్థతా॥ 41

తాత్పర్య వివరణం.

ఇంతవరకు మూలశ్లోకములను బట్టి ఆత్మ శరీరము కంటే

ప్రపంచంకంటే వేరని తేలినది. రెండూ వేరయినప్పుడు ఆత్మవలె ప్రపంచం కూడా సత్యమని చెప్పినట్లయినది. తర్కశాస్త్రము చెప్పినట్లే చెప్పబడినది. దీనివలన మోక్షపురుషార్థమెట్లు సిద్ధించును? అని ప్రశ్నయే ఈ శ్లోకమున కర్థము.

శ్లో॥ ఇత్యాత్మ దేహ భేదేన దేహాత్మత్వం నివారితం
ఇదానీందేహ భేదస్య హ్యసత్వంస్ఫుటముచ్యతే॥ 42

తాత్పర్య వివరణం.

ఇంతవరకు దేహములకంటే ఆత్మ వేరని చెప్పదమైనది. అనగా ముందు అనాత్మవస్తువు కంటే ఆత్మ వేరుగా నున్నదని, పరిశోధన చేయవలెను. తరువాత ఆత్మకంటే అనాత్మ వేరులేదని విచారించవలయును. ఇదియే బ్రహ్మవిచారమునకు లక్షణము. ఇక ఆత్మకంటే దేహము మొదలగు దృశ్యం వేరులేదని చెప్పుచున్నారు.

శ్లో॥ చైతన్యస్యైకరూపత్వాద్భేదోయుక్తో నకర్హిచిత్।
జీవత్వం చమృషాజ్ఞేయంరజ్జౌ సర్పగ్రహోయథా॥ 43

తాత్పర్య వివరణం.

ఘటము ప్రకాశించుచున్నది అనగా తెలియుచున్నది. పటము తెలియుచున్నది. అని అనుగతమైన అనుభవమునుబట్టి చైతన్యరూపమైన ఆత్మ ఏకరూపమేగాని, నానా రూపమైనది కాదు. చైతన్యరూపులైన జీవులు నానావిధముగా నున్నారు కదా. అంటే తాడుయందు పాము అను భ్రమవలే, పరమాత్మయందు జీవత్వభ్రమ కలిగినది. భ్రమవలన ఏర్పడిన జీవనానాత్వము వల్ల పార

మార్థికమగు పరమాత్మ ఏకత్వమునకు విరోధములేదు. మన ముఖం ఒకటి అయినను నూరు అద్దములలో నూరుముఖములు కనిపించును, గాని అద్దములనే ఉపాధులవలననే నానాత్వము యేర్పడినది. దానివలన ముఖం ఒకటి యనుటలో విరోధంలేదు. ఘటాకాశము మఠాకాశము అని అనేక ఉపాధులలో ఆకాశము ఉపాధిభేదముచేత అనేక ఆకాశములుగా కనిపించినను, పరమార్థముగా ఆకాశం ఒకటేగాని నానాకాదు. అటులనే అజ్ఞాన కల్పితమైన అంతఃకరణ లనేకములు గనుక ఆయంతఃకరణలయందు పరమాత్మ ప్రతిబింబములే ఆజీవులుగను, ఆజీవులు చాలా మంది యున్నను. బింబమైన పరమాత్మ ఒకటియేగాని నానాకాదని అద్వితీయమని ప్రతిబింబ రూపులయిన జీవులందరు బింబమైన పరమాత్మ కంటే వేరుకాడు. గనుక ఏకత్వమునకు భంగములేదని గ్రహించవలసిన విషయం.

శ్లో ॥ రజ్జ్వజ్ఞానాత్‌క్షణేనైవ యద్వద్రజ్జుర్హి సర్పిణీ ।
భాతితద్వచ్చితిస్సాక్షా ద్విశ్వాకారేణ కేవలా ॥ ౪౪

తాత్పర్య వివరణం.

తాడు అని తెలియనపుడు తాడును ఆవరించిన అజ్ఞానము వలన ఆ త్రాడే సర్పముగా ఎట్లు కనిపించుచున్నదో అటులనే సచ్చిదానందరూప పరమాత్మ ఆవరణ విక్షేపశక్తులతో కూడిన అజ్ఞానముచేత ఆవరింపబడినదై సర్వప్రపంచ రూపముగా భాసించుచున్నది. అందుచేత సర్వ పరమాత్మ స్వరూపమే కాని వేరుకాదు.

శ్లో॥ ఉపాదానం ప్రపంచస్య బ్రహ్మణోఽన్యన్న విద్యతే।
తస్మాత్సర్వ ప్రపంచోఽయం బ్రహ్మైవాస్తి న చేతరత్॥ ౪౫

తాత్పర్య వివరణం.

సర్వ ప్రపంచమునకు ఉపాదాన కారణం బ్రహ్మ యేకాని మరియొకటి లేదు అనగా పరమాణువులు గాని, మూల ప్రకృతికాని ఉపాదానం కావు. ఉపాదానముకంటే కార్యము వేఱకాదు. గనుక అంతయు బ్రహ్మయే కాని వేరుకాదు ఉపాదానం రెండు విధములు. పరిణామ్యుపాదానం వివర్తోపాదానం అని, మార్పును చెంది కార్యాకారమును తాల్చినది పరిణామ్యుపాదనమనబడును. పాలు పెరుగువలె పరిణమించును గనుక పెరుగుకు పాలు పరిణామ్యుపాదానమగును. మార్పును చెందకుండా కార్యరూపమును తాల్చినది వివర్తోపాదాన మనబడును. శుక్తిఏమీ మారకుండా వెండివలె కనిపించును గనుక వెండికి ముచ్చెవుచిప్ప వివర్తోపాదానం. అటులనే ఆత్మ ఏమీ మారకుండా ప్రపంచమువలె భాసించుచున్నది గనుక ప్రపంచమునకు ఆత్మ వివర్తోపాదానమని గ్రహించవలయును. అనగా అధిష్ఠానమని అర్థము.

శ్లో॥ వ్యాప్యవ్యాపకతా మిథ్యా సర్వమాత్మేతిశాసనాత్।
ఇతిజ్ఞాతే పరేతత్త్వే భేదస్యావసరః కుతః ॥४८॥

తాత్పర్య వివరణం.

పైవిధముగా అంతయు పరమాత్మయే గనుక ఒకనాటి వ్యాపకమని నానావిధములైె దృష్టి అంతయు మిథ్యా. మిథ్యయనగా యథార్థము తెలుసుకుంటే పొయ్యేది అని అర్థము. మెళుకువ వస్తే స్వప్న భ్రమలేనట్లు ఆత్మసాక్షాత్కారము కలిగితే ప్రపంచ భ్రమ వుండుటకు అవకాశం లేదు. గనుక ప్రపంచమంతయు మిథ్యాభూత మని గ్రహించవలయును.

శ్లో॥ శ్రుత్యానివారితం నూనం, నానాత్వం స్వముఖేనహి।
కథం భాసోభవేదన్యః స్థితేచాద్వయకారణే॥

తాత్పర్య వివరణం.

శ్రుతి పరమాత్మయందు నానాత్వములేదని చెప్పుచున్నది, అయిన పుడు అద్వితీయమైన, అభిన్ననిమిత్తోపాదానమైన పరమాత్మయందు పరమాత్మకంటే వేరుగా నానావిధములైన కార్యప్రపంచము యెట్లుండును? అధిష్ఠానమగు ఆత్మయే సత్యం, ప్రపంచం భ్రమమాత్రమని తాత్పర్యం.

శ్లో॥ దోషోఽపి విహితశ్శ్రుత్యా మృత్యోర్మృత్యుంస గచ్ఛతి।
ఇహ పశ్యతి నానాత్వం మాయయా వంచితో నరః॥

తాత్పర్య వివరణం.

పరమాత్మయందు అజ్ఞానముచే నానాత్వబుద్ధి కలవాడు. మృత్యువు నుండి మృత్యువును పొందును అనగా జననమరణ పరంపరను పొందును అని శ్రుతి నానాత్వదృష్టిని దూషించుచున్నది యని తాత్పర్యము.

శ్లో॥ బ్రహ్మణస్సర్వభూతాని జాయంతే పరమాత్మనః।
తస్మాదేతాని బ్రహ్మైవభవంతీత్యవధారయేత్॥

తాత్పర్య వివరణం.

బ్రహ్మ అనగా దేశకాలవస్తు పరిచ్ఛేదములేని వ్యాపకమైన దని యర్థము. బ్రహ్మయే పరమాత్మ అట్టి పరమాత్మవలన ఆకాశం మొదలగు సమస్త భూతములు పుట్టుచున్నవి. బ్రహ్మయందే స్థితిని పొందుచున్నవి. బ్రహ్మయందే లయించుచున్నవి అందుచేత బ్రహ్మకంటే జగత్తు వేరు కాదని నిశ్చయించుకొనవలయును. సమస్త భూతములు బ్రహ్మవల్ల పుడు చున్నవంటే బ్రహ్మ ఉపాదానకారణం గనుక ఉపాదానముకంటె ప్రపంచము వేరులేదని చెప్పుటయందే అనగా సృష్టి శ్రుతులకు పరమాత్మ యందే తాత్పర్యమని గ్రహించవలయును.

శ్లో॥ బ్రహ్మైవ సర్వనామాని రూపాణి వివిధానిచ।
కర్మాణ్యపి సమగ్రాణి బిభర్తీతి శ్రుతిర్జగౌ॥ ౫౦

తాత్పర్య వివరణం.

బృహదారణ్యకోపనిషత్తు సర్వనామములు అనగా అన్ని వాచక శబ్దములు, రూపములన్నియు అన్నికర్మలును బ్రహ్మయే. అనగా పరమాత్మయే అన్ని రూపములుగా భాసించుచున్నదని బోధించుచున్నది.

శ్లో॥ సువర్ణాజ్జాయ మానస్య సువర్ణత్వంచ శాశ్వతం।
బ్రహ్మణో జాయమానస్య బ్రహ్మత్వంచ తథాభవేత్ ॥౫౧

తాత్పర్య వివరణం.

బంగారములోనుండి తయారైన సొమ్ములన్నియు బంగారమేకాని బంగారంకంటే వేరుకావు. భూషణములన్నిటికి బంగారమే యథార్థ స్వరూపం, అటులనే బ్రహ్మలోపుట్టిన ప్రపంచమంతకు బ్రహ్మయే పరమార్థంకాని వేరుకాదు.

శ్లో॥ స్వల్పమప్యంతరం కృత్వా జీవాత్మ పరమాత్మనోః।
యస్సంతిష్ఠతి మూఢాత్మా భయంతస్యాభి భాషితః॥

తాత్పర్య వివరణం.

పరమాత్మ వేరు. నేను వేరు అని ఎవడైతే ఏమాత్రమైన భేదమును భావించునో అట్టి మూఢబుద్ధి కలవానికి భయం తప్పదని శ్రుతులు చెప్పుచున్నవి.

ఈశ్లోకములన్నియు శ్రుతుల అర్థమునే చెప్పుచున్నవిగనుక వేరుగా వ్యాఖ్యలను వివరించనవసరం లేదు. అన్ని శ్లోకములు ఉపనిషత్తులతో సమానమని విశ్వసించవలయును.

శ్లో॥ యత్రాజ్ఞానాద్భ వేద్వైత మితరస్తత్ర పశ్యతి।
ఆత్మత్వేన యదాసర్వం నేతర స్తత్ర చాణ్వపి॥ ౫౭

తాత్పర్య వివరణం

యే అజ్ఞానదశయందు అజ్ఞానముచేత అద్వితీయమైన పరమాత్మ ద్వైతమువలె నానారూపముగా భాసించునో, ఆ యజ్ఞానదశయందు ఇతరుడు వేరుగానుండి భిన్నమైన విషయములను చూచినట్లు, విన్నట్లు, ఆస్వాదించినట్లు వ్యవహరించునుగాని ఆత్మసాక్షాత్కారము కలిగిన జ్ఞానదశయందు అంతయు ఆత్మయేగాని వేరు ఏమిలేదుగనుక. జీవత్వభ్రాంతి కూడా పోవునుగనుక, ఎవ్వడు దేనిని చూచును. దేనిని వినును, ఎటులననగా ఒకడు ఏకాంతమందు నిద్రపోయినపుడు పెద్దస్వప్నము వచ్చిన యడల ఆ స్వప్నసమయమందు భార్యాపుత్రులు, గృహము, ధనము అన్ని యున్నట్లు విషయములను చూచినట్లు విన్నట్లు గోచరించును. మెలకువ వచ్చినపుడు తను ఒకడే మిగులునుగనుక. దేనిని చూస్తాడు, దేనిని వింటాడు. అటులనే అజ్ఞానదశయందు ప్రపంచము భాసించును. జ్ఞానదశయందు ఏమియులేదు. అద్వితీయమైన పరమాత్మయే యుండునని తాత్పర్యము.

శ్లో॥ యస్మిన్ సర్వాణి భూతాని హ్యాత్మత్వేన విజానతః।
నైవతస్య భవేన్మోహో నచశోకోఽద్వితీయతః॥

తాత్పర్య వివరణం.

యే మహానుభావుడు జ్ఞానదశయందు సర్వభూతములను సచ్చిదా

నంద రూపమగు ఆత్మయేనని చూచునో అట్టి మహానుభావునికి భ్రమ కలుగదు. మానసికదుఃఖము కలుగదు. ఎందుచేతనంటే అద్వితీయుఁడు గనుకనే.

శ్లో॥ అయమాత్మాహి బ్రహ్మైవ సర్వాత్మక తయాస్థితః।
ఇతినిర్ధారితం శ్రుత్యాబృహదారణ్య సంస్థయా॥ ౬౩

తాత్పర్య వివరణం.

బృహదారణ్యకోపనిషత్తు ఈఆత్మ బ్రహ్మస్వరూపమేకాని వేరుకాదు సర్వాత్మకముగా నున్నదని.పరమాత్మయే యున్నదిగాని ద్వైతములేదని. చెప్పుచున్నది.

శ్లో॥ అనుభూతోఽప్యయంలోకో వ్యవహారక్షమోఽపిసన్।
అసద్రూపో యథాస్వప్న ఉత్తరక్షణ బాధతః॥ ౬౪

తాత్పర్య వివరణం.

స్వప్నావస్థయందు అనేక పదార్థములుండి అన్ని వ్యవహారములు చేసినట్లు కనిపించినను, ఉత్తరక్షణంలో ప్రబోధకలుగగానే స్వప్నదృశ్య మంతయు నశించిపోవుచున్నది గనుక స్వప్నదృశ్యము సత్యముకాదు. అటులనే ఈ ప్రపంచమునందు అన్నివ్యవహారములు జరుగుచున్నను అనుభవంలోనున్నను, ఆత్మసాక్షాత్కారము కలుగగనే క్షణంలో నశిం చును గనుక సత్యముకాదు. జ్ఞానముచేత నివర్తించునుగనుక మిథ్యాభూత మని స్వప్నతుల్యమని యర్థము.

శ్లో॥ స్వప్నో జాగరణేఽలీకః స్వప్నే జాగరణం నహి।
ద్వయమేవ లయేనాస్తి లయోఽపిహ్యుభయోర్నచ॥ ౬౫

తాత్పర్య వివరణం.

జాగ్రదావస్థయందు స్వప్నదృశ్యము లేదు. స్వప్నావస్థయందు జాగ్రత్ప్రపంచము లేదు. జాగ్రత్ప్రపంచము స్వప్నప్రపంచము రెండు కూడా సుషుప్త్యవస్థయందు లేవు. ఒక అవస్థ మరియొక అవస్థయందు ఉండదు, గోచరించదు గనుక మూడు అవస్థలు మిథ్యాభూతములేకాని సత్యములు కావు.

శ్లో॥ త్రయమేవ భవేన్మిథ్యా గుణత్రియ వినిర్మితం।
అస్యద్రిష్టా గుణాతీతో నిత్యోహ్యే కశ్చిదాత్మకః ॥౨౮

తాత్పర్య వివరణం.

జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ, ఈ మూడు అవస్థలు, సత్వరజస్తమో గుణములతో కూడిన మాయచేత కల్పింపబడినవి, గనుక మిధ్యా భూతములేకాని సత్యములుకావు, మూడు అవస్థలను చూచే ఆత్మ ఒకడే. అవస్థలు మారినను అన్నియవస్థలలో అనుగతమై గోచరించు చున్నాడు గనుక అవస్థాత్రయము కంటే అతీతమైన సచ్చిదానంద స్వరూపుడని గ్రహించవలెను.

శ్లో॥ యద్వన్మృది ఘటభ్రాంతిం శుక్తౌవారజతస్థితిం।
తద్వద్బ్రహ్మణి జీవత్వం వీక్ష్యమాణే వినశ్యతి॥

తాత్పర్య వివరణం.

అవస్థాత్రయం సత్యం కాకపోయినను జీవుడు సత్యము కావచ్చునుకదా అంటే సమాధానం: మట్టియందు ఘటము వేరుగా సత్యముగా నున్నదని ఎట్లు భ్రాంతి కలుగుచున్నదో, శుక్తియందు రజతమని భ్రమ ఎట్లు కలుగుచున్నదో అటులనే బ్రహ్మయందు జీవుడనే భ్రమ కలుగు

చున్నది. మట్టిగాని ఘటం వేరుగాలేదని తెలుసుకున్నప్పుడు ఘటమునకు వేరుగా సత్యత్వమున్నదనే భ్రమ నశించునట్లు, శుక్తిని తెలుసుకున్నపుడు రజతభ్రమ పోయినట్లును, బ్రహ్మసాక్షాత్కారము కలిగినపుడు జీవత్వ భ్రమ నశించును.

శ్లో॥ యథామృది ఘటోనామ కనకేకుండలాభిధా।
శుక్తౌహిరజత ఖ్యాతిర్జీవ శబ్ద స్తథాపరే॥ 49

తాత్పర్య వివరణం.

ఒక ఆకారము తయారుచేసి మట్టినే ఘటమంటున్నాముకాని, ఘటము నామమాత్రమేకాని వేరులేదు. అనగా ఘటమనే పేరేగాని ఘట మనే పేరుతో చెప్పతగిన మట్టికంటే వేరైనవస్తువు లేదని యర్థము, ఒక ఆకారముగా చేసిన బంగారమునే కుండలము లంటున్నాముగాని కుండ లములు వేరుగా లేవు. నామమాత్రమే శుక్తియందు భ్రమతో రజతం అని అనడమేగాని రజతంలేదు. అటులనే పరబ్రహ్మయందు భ్రమతో నేను జీవుడననే మాటయేగాని బ్రహ్మకంటే జీవుడు వేరులేదని తాత్పర్యం.

శ్లో॥ యథైవవ్యోమ్ని నీలత్వం యథానీరం మరుస్థలే।
పురుషత్వంయథాస్థాణౌతద్వద్విశ్వం చిదాత్మని॥

తాత్పర్య వివరణం.

రూపములేని ఆకాశమునందు నలుపు వున్నట్లు భ్రమించుట యెట్లో, నీరులేని మెట్ట ప్రదేశమందు అనగా ఎండమావులయందు నీరు ప్రవ హించుచున్నట్లు భ్రమ యెట్లో, కొంచెం చీకటిలో నిలిచిన స్తంభ మును పురుషుడని భ్రమించుట యెట్లో, అటులనే బ్రహ్మయందు ప్రపం చము గోచరించుచున్నది. అనగా బ్రహ్మయే అజ్ఞానముచేత ప్రపంచము

వలె కనిపించుచున్నది. గనుక ప్రపంచం నామమాత్రమేకాని వేరుకాదని తాత్పర్యము.

శ్లో॥ యథైవ శూన్యే వేతాళో గంధర్వాణాం పురం యథా।
యథాఽకాశే ద్విచంద్రత్వం తద్వత్సత్యే జగత్స్థితిః॥

తాత్పర్య వివరణం.

జనంలేని ప్రదేశమందు భూతమున్నట్లు, అనగా పిశాచమున్నట్లు, శూన్యమైన ఆకాశమందు గంధర్వ నగరమున్నట్లు, గంధర్వ నగరమనగా ఆకాశమందు నలుపుగా, పచ్చగానున్న మేఘములు ఒక పట్టణము ఆకారముగా పరిణమించియుండుట. ఆకాశమందు ఇద్దరు చంద్రులు ఉండుట, యెట్లో, సత్యమైన బ్రహ్మయందు జగత్తు ఉండుటకూడా అట్లేనని అనగా భ్రమయని గ్రహించవలయును.

శ్లో॥ యథా తరంగ కల్లోలై ర్జలమేవ స్ఫురత్యలం।
పాత్రరూపేణ తామ్రంహి బ్రహ్మాండౌ ఘైస్తథాత్మతా॥

తాత్పర్య వివరణం.

ఉదకం తరంగిము, బుడగలు మొదలగు స్వరూపముతో నెట్లు కనిపించుచున్నదో, రాగి కాగులు మొదలగు పాత్రస్వరూపముతో నెట్లు కనిపించుచున్నదో అట్లె, పరమాత్మ అనేక బ్రహ్మాండముల స్వరూపముగా కనిపించుచున్నది జలంకంటే తరంగాదులు వేరుగా లేవు. రాగికంటే, రాగిపాత్రలు వేరుగా లేవు అటులనే పరమాత్మకంటే బ్రహ్మాండములు వేరులేవని తాత్పర్యము.

శ్లో॥ ఘటనామ్నా యథాపృథ్వీ పటనామ్నా హితం తవః।
జగన్నామ్నా చిదాభాతి జ్ఞేయం తత్తద భావతః॥

తాత్పర్య వివరణం.

మట్టియే కుండ అనే పేరుతో ఎట్లు గోచరించుచున్నదో, దార ములే వస్త్రమనే పేరుతో నెట్లు గోచరించుచున్నవో, వ్యవహరింపబడు చున్నవో, అటులనే పరమాత్మయే ప్రపంచమనే పేరుతో గోచరించు చున్నది. నామమాత్రమేనని, సత్యము బ్రహ్మయేనని తెలుసుకొనవల యును.

శ్లో॥ సర్వోఽపివ్యవహారస్తు బ్రహ్మణా క్రియతేజనైః।
అజ్ఞానా న్నవిజానన్తి మృదేవహి ఘటాదికం॥ ౬౫

తాత్పర్య వివరణం.

జనులు బ్రహ్మచైతన్య స్వరూపముతోనే లౌకికవ్యవహారములను శాస్త్రీయమైన కర్మకాండ, జ్ఞానకాండ వ్యవహారములను చేయుచున్నారు. లేక, అధిష్ఠానమగు బ్రహ్మనే సర్వవ్యవహారముగా వ్యవహరించు చున్నారు. అజ్ఞానమువలననే బ్రహ్మను తెలుసుకొనుటలేదు. మట్టినే ఘటాది వికారరూపముగా వ్యవహరిస్తుకూడా మట్టియే పరమార్థమని తెలుసు కొనననట్లు, పరమాత్మ రూపముతోనే సర్వ వ్యవహారములని జరుపుతూ కూడా పరమాత్మను తెలుసుకొనుటలేదని తాత్పర్యము.

శ్లో॥ కార్య కారణతాని నిత్యమాస్తే ఘటమృదోర్యథా।
తథైవ శ్రుతియుక్తిభ్యాం ప్రపంచ బ్రహ్మణోరిహ॥ ౬౬

తాత్పర్య వివరణం

మట్టి ఉపాదాన కారణం. ఘటాది వికారములు, కార్యములు

బ్రహ్మ కారణం. ప్రపంచము, కార్యం. ఇట్టి కార్యకారణభావమునుబట్టియే మట్టి స్వరూపం తెలిస్తే ఘటాది సర్వవికారములు తెలిసినట్లు, పరమాత్మ స్వరూపం తెలిస్తే సర్వ ప్రపంచం తెలియునని ఛాందోగ్యోపనిషత్తు చెప్పుచున్నది. ఈ విషయం ఉపాదాన కారణం తెలిస్తే కార్యవర్గమంతయు తెలియబడును గనుక యుక్తికూడా సరిపోవుచున్నదని కారణంకంటే కార్యము వేరుకాదనికూడా తాత్పర్యము.

శ్లో॥ గృహ్యమాణే ఘటేయద్వ న్మృత్తికా భాతివైబలాత్।
వీక్ష్యమాణే ప్రపంచేఽపి బ్రహ్మైవా భాతి భాసురం॥

తాత్పర్య వివరణం.

ఘటమును గ్రహించినయడల మృత్తికనే గ్రహించినట్లగును. అటులనే. ప్రపంచమును గ్రహించినపుడు బ్రహ్మయే భాసించుచున్నది. గనుక బ్రహ్మను గ్రహించినట్లె. అనగా కారణముకంటే కార్యము వేరు లేదు గనుక బ్రహ్మకంటే ప్రపంచం వేరులేదనియు అసలు వస్తువును అన్యథా గ్రహించుటయేగాని మార్పుఏమీ లేదనియు భావము.

శ్లో॥ సద్దైవాత్మా విశుద్ధోఽస్తి హ్యశుద్ధో భాతివై సదా।
యథైవ ద్వివిధా రజ్జుః జ్ఞానినోఽజ్ఞానినోఽనిశం॥

తాత్పర్య వివరణం.

ఏ రీతిగా తాడు (నిజమును) తాడని గుర్తించినవానికి తాడుగానే కనిపించును. తాడు స్వరూపం తెలుసుకొనిన అజ్ఞానికి భయంకరమైన సర్పముగా కనిపించునో, ఆ రీతిగానే. ఆత్మ జ్ఞానికి సర్వం శుద్ధమైన సచ్చిదానంద రూపముగానే గోచరించును, అజ్ఞానికి, అశుద్ధముగా నామ రూప ప్రపంచముగా గోచరించును. బ్రహ్మ స్వయంప్రకాశమానమైన

సత్వములలో నున్నవి. అఖండాకారవృత్తియందు ప్రతిబింబించి అజ్ఞానమును నశింపచేసినపుడే, మోక్షము కలుగును గనుక అందుచేతనే జ్ఞానికి శుద్ధముగాను, అజ్ఞానికి అశుద్ధముగాను ఆత్మ భాసించునని తాత్పర్యము.

శ్లో॥ యథైవ మృన్మయఃకుంభ స్తద్వద్దేహోఽపి చిన్మయః।
ఆత్మానాత్మ విభాగోయం ముధైవ క్రియతేఽబుధైః॥

తాత్పర్య వివరణం.

అద్వితీయమగు నిర్గుణ పరబ్రహ్మయే దేహాదులవలె భాసించినపుడు దేహమని, ఆత్మయని విభాగం ఎందుకు చేయవలెనంటే, సమాధానం. దేహముకంటే ఆత్మ వేరుగా నున్నట్లు తెలియనివారికి దేహము వేరు, ఆత్మ వేరని చెప్పవలసివచ్చినది. కాని వివేకము గలవారికి చెప్పనక్కరలేదు. కుండ మట్టి వికారముకాని వేరుకాదు. ఈ విషయంలో ఘటముకంటే మట్టివేరని విభాగంచేయుట అనవసరం. అటులనే దేహముకూడా చిన్మయమే అనగా పరమాత్మయే కాని వేరుకాదు. అందుచేత దేహంకంటే ఆత్మ వేరుగానున్నదని దేహాత్మ విభాగముచేయుట, అజ్ఞులకే కాని, విజ్ఞులకు కాదని తాత్పర్యం.

శ్లో॥ సర్పత్వేన యథారజ్జూ రజతత్వేనశుక్తికా।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా॥ 40

తాత్పర్య వివరణం.

తాడును సర్పమనుకున్నట్లు, శుక్తిని రజతమనుకున్నట్లు, ఆత్మ, అనాత్మ విభాగం తెలియని అజ్ఞాని ఆత్మ దేహమని భ్రమపడుచుండును. దీనినే తాదాత్మ్యాధ్యాసయందురు.

శ్లో॥ ఘటత్వేన యథాపృథ్వీ పటత్వే నైవతం తవః।
వినిర్ణీతా సుమూఢేన దేహత్వేనతథాత్మతా॥

తాత్పర్య వివరణం.

ఘటముకంటే పృథివి అనగా మట్టి వేరుగా నున్నది. ఘటం తయారుకానప్పుడుకూడా మట్టియున్నది. మట్టిలేనిది, ఘటములేదుగనుక, మట్టి కంటే ఘటం వేరులేదు. అటులనే వస్త్రం తయారుకానప్పుడుకూడా దారములున్నవి. కనుక వస్త్రంకంటే దారములు వేరుగానున్నవి. దారములులేనిది వస్త్రస్వరూపం లేదుగనుక దారముల కంటే వస్త్రం వేరులేదు. అని అనుకొనవలయును. ఈస్థితిలో కుండను ఇది మట్టియే అనుకొనుట యథార్థము. కాని, మట్టిని యిది కుండ యనుకొనుట యథార్థము కాదు. కుండ అనేస్వరూపమే లేదుగనుక, వస్త్రమును ఇది దారములేనని గ్రహించుటయథార్థము. కాని దారములను ఇవి వస్త్రమని గ్రహించుట యథార్థము కాదు. వస్త్ర మనునది లేదుగనుకనే, మట్టికంటే కుండ వేరులేదు. దారములకంటే వస్త్రం వేరేలేదుగనుకను, మట్టి,కుండా, దారములు, వస్త్రం అని విభాగంచేయుటకూడా అజ్ఞానమేనని, అటులనే ఆత్మను,దేహముగా గ్రహించుచున్నారనియు తాత్పర్యము.

శ్లో॥ కనకం కుండల త్వేన. తరంగత్వేన వై జలం।
వినిర్ణీతం విమూఢేన దేహత్వేన తథాత్మతా॥

తాత్పర్య వివరణం.

బంగారమును కుండలము లనుకున్నట్లు, నీటిని తరంగము లను కున్నట్లు అజ్ఞాని ఆత్మను దేహమనుకొనుచున్నాడు.

శ్లో॥ పురుషత్వేన యథాస్థాణు ర్జలత్వేనమరీచికా।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా॥

తాత్పర్య వివరణం.

కొద్ది చీకటిలో స్తంభమును మనుష్యుడని భ్రమపడినట్లు, ఎండ మావులయందు జలమని భ్రమపడినట్లు ఆత్మను దేహమని భ్రమ పడు చున్నాడు.

శ్లో॥ గృహత్వేనైవ కాష్ఠాని ఖడ్గత్వేనై వలోహతా।
వినిర్ణీతా విమూఢేన దేహత్వేన తథాత్మతా॥

తాత్పర్య వివరణం.

వాసములతోను, దూలములతోను, స్తంభములు మొదలగు వాట్ల తోను యిల్లు తయారుచేయుదురు. ఆ కలపను యిల్లు అనుకున్నట్లు, ఇను మును కత్తి యనుకున్నట్లు, అజ్ఞాని ఆత్మను దేహమనుకొనుచున్నాడు.

శ్లో॥ యథావృక్ష విపర్యాసో జలాద్భవతి కస్యచిత్।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥

తాత్పర్య వివరణం.

కట్టమీదవుండి చెరువులోనున్న నీటిని చూస్తే గట్టునవున్న చెట్లు కిందికి కొమ్మలు, పైకి మొదలున్నట్లు కనిపించును. అటులనే అజ్ఞాని ఆత్మను దేహముగా గ్రహించుచున్నాడు.

శ్లో॥ పోతేనగచ్ఛతః పుంసః సర్వం భాతీతి చంచలం।
తద్వదాత్మని దేహత్వ పశ్యత్య జ్ఞానయోగతః॥

తాత్పర్య వివరణం.

నదిలో పడవమీద (వెళ్ళేవానికి) వెళ్ళేవారు గట్టునఉన్న చెట్లు మొదలగునవి కదలకుండా నున్నను చెట్లు మొదలయినవి వెళ్ళుచున్నట్లు భ్రమించుచున్నాడు. అటులనే అజ్ఞాని ఆత్మను దేహముగా గ్రహించుచున్నాడు.

శ్లో॥ పీతత్వంహి యథాశుభ్రే దోషాద్భవతి కస్యచిత్॥
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

తాత్పర్య వివరణం.

కామిల దోషము కలవానికి కామెర్లు అనే దోషము వలన తెల్లని శంఖము పచ్చగానున్నట్లు కనబడును, చికిత్సతో ఆ దోషమును పోగొట్టుకున్న యడల మరల ఆశంఖము తెల్లగానే కనబడును. శంఖము ఎప్పుడును తెలుపే. అటులనే అజ్ఞానికి అజ్ఞానదోషమువలన సచ్చిదానంద రూపమగు ఆత్మ శరీరేంద్రియ సంఘాతమువలె, ప్రపంచమువలె కనిపించుచున్నది. ఆత్మజ్ఞానముచేత ఆ యజ్ఞానమును పోగొట్టుకున్న యడల అంతయు పరమాత్మగా గోచరించునని తాత్పర్యము.

శ్లో॥ చక్షుర్భ్యాం భ్రమశీలభ్యాం సర్వంభాతి భ్రమాత్మకం
తద్వదాత్మనిదేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

తాత్పర్య వివరణం.

భ్రమపడే స్వభావముగల నేత్రములతో అనేక భ్రమలను పొందుచున్నట్లు ఆత్మ దేహమని భ్రమపడుచున్నాడు.

శ్లో॥ అలాతంభ్రమణేనైవ వర్తులం భాతిసూర్యవత్।
తద్వదాత్మనిదేహత్వం నిపశ్యత్యజ్ఞానయోగతః।

తాత్పర్య వివరణం.

కొరివిని గుండ్రముగా తిప్పినపుడు ఆ కొరివి ఎదుటనున్నవారికి సూర్యునివలె గుండ్రముగా కనిపించును. అనేకవిధములుగా తిప్పేకొద్దీ బాణాకారముగాను, నాల్గు పలకలగా నున్నట్లు, అనేక విధములుగా కనిపించును. అటులనే అజ్ఞాని ఆత్మను దేహమని భ్రమపడుచున్నాడు.

శ్లో॥ మహత్వే సర్వవస్తూనా మణుత్వం హ్యతి దూరతః
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

తాత్పర్య వివరణం.

చాలా దూరముగానున్న పెద్దచెట్లు దూరత్వదోషమువలన చిన్న ముక్కలగా కనిపించును. ప్రపంచంకంటే వ్యాపకమైన చాలా దూరములో నున్న చంద్రబింబము కొద్ది బింబముగా కనిపించుచున్నది. దూరముగానున్న గొప్ప పర్వతం గోడయెత్తున్నట్లు కనిపించుచున్నది. అటులనే అజ్ఞానమువలన ఆత్మ దేహమువలె కనబడుచున్నది.

శ్లో॥ సూక్ష్మత్వే సర్వభావానాం స్థూలత్వంచోప నేత్రతః।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

తాత్పర్య వివరణం.

ఒకరకమైన భూతద్దం కళ్ళజోడుగా తయారుచేసిగాని, చేయకగాని, నేత్రములకు పెట్టుకొని చూచినయడల చిన్నవస్తువులు పెద్దవిగా కనిపించినట్లు, అజ్ఞానంవల్ల ఆత్మ దేహమువలె కనిపించుచున్నది. కనిపించుటయేగాని అసలువస్తువులు మారుటలేదు. లేనివస్తువులు ఉండుట లేదని అన్ని దృష్టాంతములలో గ్రహించతగిన విషయము.

శ్లో॥ కాచభూమౌ జలత్వంవా జలభూమౌచ కాచతా।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

తాత్పర్య వివరణం.

గాజు భూమియందు జలమని భ్రమకలిగినట్లు, జలమున్న భూమి యందు సూర్యకిరణ సంబంధమువలన గాజు అని భ్రమకలిగినట్లును, అజ్ఞానమువలన ఆత్మయందు దేహమని భ్రమకలుగుచున్నది.

శ్లో॥ యద్వదగ్నౌ మణిత్వంహి మణౌవా వహ్నితాపుమాన్।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

తాత్పర్య వివరణం.

ఒకప్పుడు భ్రాంతి స్వభావముకల నేత్రములు కలవానికి అగ్ని యందు మణియని భ్రమకలిగినట్లు,మణియందు అగ్నియని భ్రమకలిగి నట్లును అజ్ఞానమువలన ఆత్మయందు దేహమని భ్రమకలుగుచున్నది.

శ్లో॥ అభ్రేషు సత్సుధావత్సు సోమోధావతి భాతివై।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

తాత్పర్య వివరణం.

ఆకాశమందు మేఘములు చాలా త్వరగావెళ్ళుచున్నపుడు మధ్యలో నున్న చంద్రుడు త్వరగా వెళ్ళుచున్నట్లు కనిపించును. అటులనే అజ్ఞానము వలన ఆత్మ దేహమువలె భ్రాంతులకు కనిపించుచున్నది.

శ్లో॥ యథైవ దిగ్విపర్యాసో మోహాద్భవతి కస్యచిత్।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్యజ్ఞానయోగతః॥

తాత్పర్య వివరణం.

కొందరికి ఇతర గ్రామములయందు. ఇతర దేశములయందు. తూర్పు పడమరయని, పడమర తూర్పయని, దక్షిణం ఉత్తరమని ఉత్తరం దక్షిణమని భ్రమ కలుగును. అటులనే ఆత్మయందు దేహమని భ్రమ కలుగుచున్నది.

శ్లో॥ యథాశశీ జలేభాతి చంచలత్వేన కస్యచిత్।
తద్వదాత్మని దేహత్వం పశ్యత్య జ్ఞానయోగతః॥

తాత్పర్య వివరణం.

చెరువులు మొదలగు జలాశయములయందు గాలివలన నీరు కదలి నపుడు ఆ నీటిలో ప్రతిబింబించిన చంద్రుడుకూడా కదులుచున్నట్లు భ్రమ కలుగును. అటులనే ఆత్మయందు అజ్ఞానమువలన దేహమని భ్రమకలుగు చున్నది. ఇవియన్నియు ఒకవస్తువు మరియొక వస్తువుగాగాని, ఇతరధర్మ ములతో నున్నట్లుగాని కనిపించు భ్రమలే. అటులనే అజ్ఞానముచేత ఆవ రింపబడిన ఆత్మయు దేహమువలె, ప్రపంచమువలె కనబడుచున్నది.

శ్లో॥ ఏవమాత్మన్యవిద్యాతో దేహాధ్యాసోహిజాయతే।
సఏవాత్మపరి జ్ఞానాల్లీయతే చపరాత్మని॥ ౪౨

తాత్పర్య వివరణం.

వెనుక 12 శ్లోకములలో చెప్పిన విషయము ఈ శ్లోకములో పూర్తి చేయుచున్నారు ఈ రీతిగా ఆత్మయందలి అజ్ఞామువలన అనగా ఆత్మను ఆవరించిన అజ్ఞానమువలన దేహాధ్యాస కలుగుచున్నది. అనగా ఆత్మయే దేహమని భ్రమకలుగుచున్నది. ఏవస్తువుయందు చీకటివుండునో ఆవస్తువుయందు వెల్తురు వ్యాపించినపుడే ఆ చీకటిపోవును. అట్లే ఆత్మ

వరకు అజ్ఞానము పోవలెనంటే ఆత్మ సాక్షాత్కారమే అవసరము, గనుక ఆత్మ సాక్షాత్కారమువలన నేను మనుష్యుడనను దేహతాదాత్మ్యాధ్యాస. ఈ అధ్యాసకు మూలమైన అజ్ఞానముతో సహా అధిష్ఠానమైన ఆత్మయందే లయించును. ఆరోపము అధిష్ఠానము కంటే వేరుకాదు గనుక అధిష్ఠాన రూపమగును అని తాత్పర్యము. అధ్యాస, ఆరోపము, భ్రమ, భ్రాంతి అనే పదములకు ఒకే అర్థము, ఆత్మసాక్షాత్కారము అన్నను బ్రహ్మసాక్షాత్కారమన్నను. జీవబ్రహ్మైక్య సాక్షాత్కారమన్నను ఒకటే.

శ్లో॥ సర్వమాత్మ తయాజ్ఞాతం జగత్ స్థావర జంగమం।
అభావాత్సర్వ భావానాం దేహస్యకుత ఆత్మతా ॥౮౮॥

తాత్పర్య వివరణం.

అధిష్ఠానమగు ఆత్మకంటే ఆరోపితమగునది ఏదీ లేదు, కాదు గనుక అధిష్ఠానమగు ఆత్మసాక్షాత్కారము కలిగినపుడు ఆరోపమంతయు నశించును. ఆత్మకంటే వేరయినది ఏదీ లేనపుడు దేహము ఆత్మ ఎట్లు అగును ? దేహమనే ఆరోపముకూడా నశించునని తాత్పర్యము.

శ్లో॥ ఆత్మానం సతతం జానన్ కాలం నయమహాద్యుతే।
ప్రారబ్ధమఖిలం భుంజన్ నోద్వేగం కర్తుమర్హసి ॥౮౯॥

తాత్పర్య వివరణం.

జ్ఞానికదా పరమాత్మరూపుడు. అనగా సచ్చిదానందరూపుడు, నాకేమి ప్రయోజనమని ఎవ్వరు అనుకొనవద్దని అజ్ఞానితో చెప్పినట్లు అందరికిని దయతో ఆచార్యస్వాములవారు చెప్పుచున్నారు. సాధకుడవైన నీవుకూడా యెల్లపుడు వేదాంత శ్రవణ మనన నిదిధ్యాసనలతో కాలమును గడుపుచు ఆత్మసాక్షాత్కారమును సంపాదించుము జీవన్ముక్తుడవగుదువు. ప్రారబ్ధ

మును మాత్రమే అనుభవింధవలయును కాని వేరేని యు లేదు ప్రారబ్ద మప్పుడు కూడా వుండునా యని ఆశుర్దాపడవద్దు అని తాత్పర్యము.

శ్లో॥ ఉత్పన్నే ప్యాత్మ విజ్ఞానే ప్రారంబ్ధం నైవముంచతి।
ఇతియచ్ఛ్రూయతే శాస్త్రే తన్ని రాక్రియతేఽధునా॥50

తాత్పర్య వివరణం.

ఆత్మ జ్ఞానం కలిగినను, ప్రారబ్దం అనుభవించవలసినదేనని శాస్త్రము చెప్పినమాట పరమార్థముకాదు. అజ్ఞానుల దృష్టికి జ్ఞానికూడా శరీర ధారిఅయి ఏదోపనులు చేయుచున్నట్లు కనిపించును గనుక, చూచువారి తృప్తికొరకు ప్రారబ్దముండునని చెప్పినదే కాని జ్ఞానిదృష్టినిపట్టి శాస్త్రం చెప్పలేదు. జ్ఞానిదృష్టికి ఏమియులేదు జ్ఞానం కలుగగనే అజ్ఞానంపోవును. అజ్ఞానం పోగానే అన్ని దృశ్యములు నశించును. గనుక ప్రారబ్ద కర్మ లేదు, భోగములేదు. ఏమియులేదనే శాస్త్రరహస్యం. ఈ విషయమునే శంకర భగవత్పాదులవారు చెప్పుచున్నారుగాని వేరుకాదు. జీవన్ముక్తి స్థితిని అజ్ఞుల దృష్టినిబట్టి చెప్పినదేనని గ్రహించవలయును.

శ్లో॥ తత్వజ్ఞానోదయాదూర్ధ్వం ప్రారబ్ధం నైవవిద్య తే।
దేహదీనామ సత్వాత్తు యథాస్వప్నో విభోధతః ॥51॥

తాత్పర్య వివరణం.

మెళుకువ వచ్చిన తరువాత స్వప్నము నిశ్శేషముగా నశించనట్లు ఆత్మసాక్షాత్కారం కలిగిన తరువాత అన్ని భ్రమలకు కారణమైన అజ్ఞా నమే నశించును గనుక అజ్ఞానం నశించినపుడు దేహాదులుకూడా వుండవు. అందుచేత ప్రారబ్ధంకూడా లేదని తాత్పర్యం.

శ్లో॥ కర్మ జన్మాంతరీయం యత్ప్రారబ్ధమితి కీర్తితం।
తత్తు జన్మాంతరా భావాత్పుంసో నైవాస్తి కర్హిచిత్ ॥52

తాత్పర్య వివరణం.

కర్మ సంచితం, వర్తమానం, ప్రారబ్ధం అని మూడురకములు వెనుక చేసిన కర్మ సంచితం. ఇప్పుడు చేస్తున్నది అసగా వర్తమానం ఇదీ చేయబోయ్యేది కూడా ఆగామియనబడును. సంచితములో నుండి ఫలము నిచ్చుటకు బయలుదేరి ఈ దేహమును కలుగచేసి ఈ దేహంలో సుఖ దుఃఖములను కలుగచేసే కర్మ ప్రారబ్ధ మనబడును. ఇది మనం తెలుసు కొనవలసిన విభాగమే కాని శంకర భగవత్పాదులవారు జ్ఞానదృష్టిని బట్టియే చెప్పుచున్నారు. ఏమంటే, జన్మాంతరీయ కర్మయే ప్రారబ్ధము. జన్మాంతరమే లేదుగనుక ప్రారబ్ధం లేదు. ముందు జన్మనిచ్చునాయంటే ముందుజన్మ లేదు. పోనిమ్ము జన్మనిచ్చినదాయంటే ఈ జన్మకూడాలేదు. గనుక జ్ఞానికి అంతయు పరమాత్మయేగనుక ప్రారబ్ధమే లేదని తాత్ప ర్యము.

శ్లో॥ స్వప్న దేహో యథాధ్య స్తస్తథైవాయంహి దేహకః
అధ్యస్తస్య కుతో జన్మజన్మాభావేహి తత్కుతః ॥53॥

తాత్పర్య వివరణం.

స్వప్నమందు దేహమున్నట్లు అప్పటికపుడు భ్రమగా కనపించునే గాని జన్మలేదు. అట్లై ఈ దేహముకూడా భ్రమగా కనిపించుచున్నదేగాని క్రమగతిగా జన్మలేదు, గనుక దీనికి కారణమైన ప్రారబ్ధము లేదు లేదని కూడా చెప్పకూడదని తాత్పర్యము.

శ్లో॥ ఉపాదానం ప్రపంచస్య మృద్భాండస్యేవ కథ్యతే।
అజ్ఞానంచైవ వేదాన్తై స్తస్మిన్నష్టేక్వ విశ్వతా ॥౧౩౪॥

తాత్పర్య వివరణం.

మట్టి కుండకు గురించి ఉపాదాన కారణం. అటులనే పరమాత్మ నావరించిన అజ్ఞానం ప్రపంచరూపముగా పరిణమించును గనుక అజ్ఞానం ప్రపంచమునకు ఉపాదాన కారణం అని వేదాంతములు చెప్పుచున్నవి. జ్ఞానముచేత అజ్ఞానమే నశించినపుడు ప్రపంచం ఎట్లావుంటుంది? ఉండదని తాత్పర్యం. ఒక ముఖ్యవిషయం. కేవలం బ్రహ్మ నిర్వికారం గనుక ప్రపంచమునకు కారణంకాదు. నిర్వికారమైన బ్రహ్మమాత్రమే కారణమైతే మోక్షదశయందుకూడా ప్రపంచం పుట్టవలసివచ్చును. కేవలం అజ్ఞానం ఒకటే ప్రపంచమునకు కారణం కాదు. జడంగనుక, చేతన సంబంధంకూడా కారణం కానేరదు. అందుచేత అజ్ఞానంతో కూడిన బ్రహ్మమే జగత్కారణం అని చెప్పవలయును. అట్లయినను అజ్ఞానం లేకపోతే జగత్తులేదుకదా.

శ్లో॥ యథారజ్జుం పరిత్యజ్యసర్పం గృహ్ణాతి వైభ్రమాత్।
తద్వత్సత్యమవిజ్ఞాయ జగత్పశ్యతి మూఢధీః॥

తాత్పర్య వివరణం.

తాడునువదలి అనగా తెలిసికొనక సర్పమని భ్రమపడినట్లు, అజ్ఞాని సత్యమగు బ్రహ్మను తెలుసుకొనక ప్రపంచముగా చూచుచున్నాడు. సిద్ధమగు స్వరూపమునుకూడా అజ్ఞానం మరిపించి అనగా తెలియచేయకుండాచేసి భ్రాంతిని కలిగించినదని తాత్పర్యము.

శ్లో॥ రజ్జురూపే పరిజ్ఞాతే సర్పఖండం నతిష్ఠతి
అధిష్ఠానే తథాజ్ఞాతే ప్రపంచశ్శూన్యతాం గతః॥

తాత్పర్య వివరణం.

తాడును తెలిసికొంటే అజ్ఞానం నశించును గనుక సర్పములేదు. అటులనే ఆత్మజ్ఞానం కలిగినపుడు ప్రపంచమంతయు శూన్యమగునుగనుక జ్ఞానికి ప్రారబ్ధము లేదని తాత్పర్యము.

శ్లో॥ దేహస్యాపి ప్రపంచత్వా త్ప్రారబ్ధావస్థితిః కుతః
అజ్ఞాని జనబోధార్థం ప్రారబ్ధం వక్తి వై శ్రుతిః॥

తాత్పర్య వివరణం.

జ్ఞానికి జ్ఞానంవల్ల అజ్ఞానంతోసహా ప్రపంచం నశించును. దేహము కూడా ప్రపంచంలో చేరినదేగనుక అదికూడా నశించును. దేహమే లేక పోతే ప్రారబ్ధ మెక్కడవుంటుంది. ఉండదని తాత్పర్యము.

అయితే వేదము జ్ఞానికి ప్రారబ్ధమున్నదని ఎందుకనిచెప్పుచున్న దంటే జ్ఞానికి జ్ఞానంవల్ల అజ్ఞానంపోతే శరీరంకూడా పోవలెకదా మాకెందుకు కనిపించుచున్నదని అజ్ఞానులడిగితే వారికి సమాధానంగా జ్ఞానికి కూడా ప్రారబ్ధముండునని చెప్పినదేగాని నిజంగా ప్రారబ్ధమున్నదని చెప్ప లేదు. అజ్ఞాని జనబోధార్థం అని స్పష్టముగా చెప్పిరి.

శ్లో॥ క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టేపరావరే
బహుత్వం తన్నిషేధార్థం శ్రుత్యాగీతం చయత్స్ఫుటం

తాత్పర్య వివరణం.

క్షీయన్తేచాస్య కర్మాణి అని ఉపనిషత్తు జ్ఞానికి పరమాత్మ సాక్షాత్కారము కలిగినవెంటనే అజ్ఞానంతో సహా అంతఃకరణ తాదాత్మ్య భ్రమతో సహా సర్వకర్మలు నశించునని బహువచనముతో చెప్పుచున్నది. జ్ఞానికి ప్రారబ్ధకర్మ నశించకవుండేయడల ఆగామిసంచితములే నశించే యెడల కర్మాణి అని బహువచనం లేకుండా కర్మణీ అని ద్వివచనముచేత ఆగామిసంచితములే నశించునని చెప్పవలసియుండును. అటులచెప్పక సర్వకర్మలు నశించునని చెప్పినందువలన జ్ఞానికి ప్రారబ్ధములేదని తాత్పర్యము.

శ్లో॥ ఉచ్యతేఽజ్ఞైర్బలా చ్చైతత్త దాఽనర్థద్వయాగమః
వేదాన్తమతహానంచ యతోజ్ఞాన మితిశ్రుతిః॥

తాత్పర్య వివరణం.

శాస్త్రతాత్పర్యమును తెలుసుకొనలేక జ్ఞానికికూడా ప్రారబ్ధకర్మ ఉండునని చెప్పినయడల రెండు అనర్థములు వచ్చును. అనగా రెండుదోషములు ప్రాప్తించును అవి ఏవియనగా జ్ఞానంకలిగినతరువాత అంతాపోయి ప్రారబ్ధమున్నయడల ప్రారబ్ధముకూడా ద్వైతమేగనుక అద్వితీయమగు బ్రహ్మస్వరూపముగా నుండుట అనే మోక్షము లేకపోవలసివచ్చును. అట్టి మోక్షమే లేనపుడు మోక్షముకొరకు ఈ జ్ఞానమును సంపాదించే సంప్రదాయంకూడా లేకపోవలసివచ్చును, ద్వైతమున్నపుడు వేదాంతమతమునకుకూడా విరోధమువచ్చును. ఆత్మనే విచారించవలయును. రెండవదానిని విచారించవద్దు, ఆత్మకంటే భిన్నమైన ద్వైతమును బోధించేశాస్త్రాదులను చెప్పినయడల నోరునొప్పియని శ్రుతిచెప్పుచున్నది గనుక జ్ఞానికి ప్రారబ్ధం లేదు.

శ్లో॥ త్రిపంచా గాన్యథోవక్ష్యే పూర్వోక్తస్యహి లబ్ధయే
తచ్చసర్వైః సదాకార్యం నిదిధ్యాసనమేవతు॥

తాత్పర్య వివరణం.

ఇంతవరకు ముఖ్యాధికారికి సాధనచతుష్టయ సంపత్తియుండును గనుక. వేదాంతశ్రవణమందు మననమందు నిదిధ్యాసయందు అధికారం కలదు. ఇట్టివిచారణద్వారా ఆత్మసాక్షాత్కారంకలిగి మోక్షము లభించునని చెప్పడమైనది. ప్రస్తుతం విషయాసక్తిచేతను, బుద్ధిమాంద్యముచేతను ఎంత వేదాంతశ్రవణాదులు చేసినను ఆత్మజ్ఞానం కలుగనివారికి శ్రవణాదులు కూడా సరిగాచేయలేనివారికిని అనగా మందాధికారులకు నిర్గుణబ్రహ్మోపాసనయే జ్ఞానంద్వారా మోక్షమునకు ముఖ్యసాధనమని చెప్పుచున్నారు.

మోక్షసిద్ధికొరకు నిదిధ్యాసనమే చేయవలెను. అట్టి నిదిధ్యాసనకు పదిహేనుసాధనములు కలవు. ఆ 15 సాధనములతో నిదిధ్యాసనం అనగా ధ్యానంచేసి ఆత్మజ్ఞానము సంపాదించిన ముక్తులగుదురని తాత్పర్యము.

శ్లో॥ నిత్యాభ్యాసాదృతే ప్రాప్తిర్నభవే త్సచ్చిదాత్మనః
తస్మాద్బ్రహ్మ నిదిధ్యాసేజ్జిజ్ఞాసుః శ్రేయసే చిరం ॥౧౦౦

తాత్పర్య వివరణం.

మందాధికారి చాలాకాలం బ్రహ్మధ్యానంలేనిది ముక్తిని పొందలేడు గనుక ఇతరసాధనలను వదలి తత్వజిజ్ఞాసులై నిరంతరం నిర్గుణ బ్రహ్మధ్యానమే చేయవలయునని తాత్పర్యము.

శ్లో॥ యమోహినియమస్త్యాగో మౌనం దేశశ్చకాలతా
ఆసనం మూలబంధశ్చ దేహసామ్యం చదృక్‌స్థితిః॥౧౦౨

శ్లో॥ ప్రాణ సంయమనంచైవః ప్రత్యాహారశ్చ ధారణా
ఆత్మధ్యానం సమాధిశ్చ ప్రోక్తాన్యంగానివై క్రమాత్॥

తాత్పర్య వివరణం.

నిర్గుణధ్యానమునకు పదిహేను అంగములు, ఏవియనగా ఈ రెండు శ్లోకములతో చెప్పుచున్నారు. యమము, నియమము, త్యాగము, మౌనము, దేశము, కాలము, ఆసనము, మూలబంధము, దేహసామ్యము, దృక్‌స్థితి, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణా, ఆత్మధ్యానం, సమాధి. ఇవియే 15 అంగములు. ఈ పదిహేను అంగములకు ముందు శ్లోకములతో ప్రత్యేకలక్షణములను చెప్పుచున్నారు. అందుచేత ఇచట వివరణ చేయలేదు.

శ్లో॥ సర్వంబ్రహ్మేతి విజ్ఞానా దింద్రియగ్రామ సంయమః
యమోఽయమితి సంప్రోక్తోఽభ్యస నీయోముహుర్ముహుః

తాత్పర్య వివరణం.

సకల ప్రపపంచము సచ్చిదానందరూపమగు బ్రహ్మయేకాని బ్రహ్మ కంటే వేరుకాదని నిశ్చయించుకొని అందువలన శబ్దస్పర్శాది విషయము లన్నియు ఆరోపితములు, అనిత్యములు, దుఃఖమును కలుగచేయునవని దోషమును గ్రహించి ఇంద్రియములను విషయముమీదికి పోకుండా అరికట్టుట యమమనబడును.

శ్లో॥ సజాతీయ ప్రవాహశ్చ విజాతీయ తిరస్కృతిః
నియమోహిపరానందో నియమాత్క్రియతేబుధైః॥ ౧౦౯

తాత్పర్య వివరణం,

ఆత్మకంటే భిన్నమైన విషయవృత్తులతో అడ్డులేకుండా ఆత్మాకారవృత్తినే యడతెగకుండా చేయుట అనగా ఆత్మచింతనము. ఇదియే నియమము అనబడును. దీనికి ఆనందమే ప్రయోజనము, అందువలననే పెద్దలు ఈ నియమమును నియమముగా అభ్యసించుచున్నారు. అనిత్యమని దుఃఖమునకు కారణమని దోషదృష్టితో మనస్సును ఆత్మ భిన్నవిషయములమీదికి వెళ్ళకుండా పరమాత్మాకారాకారితముగా చేయవలయునని తాత్పర్యము,

శ్లో॥ త్యాగః ప్రపంచరూపస్య చిదాత్మత్వావ లోకనాత్
త్యాగోహిమహతాంపూజ్యః సద్యో మోక్షమయోయత॥

తాత్పర్య వివరణం.

నామరూపాత్మకమగు ప్రపంచమునకు అధిష్ఠానము స్వప్రకాశమగు ఆత్మయేగనుక. అట్టి ఆత్మచింతనచేయుచు నామరూప ప్రపంచమను వదలి వేయుటయే త్యాగము. ఇట్టిత్యాగమునే మహాత్ములు మోక్షమునకు ముఖ్యసాధనముగా గ్రహించిరి. అంతయు ఆత్మయేనని భావించుచు ఆత్మకంటే వేరుగాలేదని భావించుటయే త్యాగము ఇదియే మోక్షసాధనమని భావము.

శ్లో॥ యస్మాద్వాచో నివర్తన్తే అప్రాప్యమనసాసహ,
యన్మౌనం యోగిభిర్గమ్యం తద్భవేత్సర్వదా బుధః॥

తాత్పర్య వివరణం.

మౌనలక్షణమును చెప్పుచున్నారు. జాతిక్రియాగుణశూన్యమైనది పరమాత్మయే. అందుచేతనే జాతిక్రియాగుణాదులుగల పదార్థములను బోధించే స్వభావముగల శబ్దములు పరమాత్మను బోధించలేవు. మనస్సుకూడా తెలుసుకొనలేదు. అందుచేతనే పరమాత్మను అవాఙ్మానసగోచరమందురు. అట్టి పరమాత్మయే ఇక్కడ మౌనం. అనగా చెప్పుటకు వీలులేనిదని యర్థము. ఇట్టి మౌనమగు పరమాత్మ యోగులకే లభ్యమగును గనుక వివేకవంతుడు అట్టి బ్రహ్మరూపుడనే నేనని ధ్యానించవలయునని తాత్పర్యము.

శ్లో॥ వాచోయస్మాన్నివర్తన్తే తద్వక్తుం కేనశక్య తే।
ప్రపంచోయదివక్తవ్య సోఽపిశబ్ద వివర్జితః॥

తాత్పర్య వివరణం.

పైనచెప్పిన మౌనము ధ్యానరూపమేకదా యని (అది పదునాల్గవ అంగంకదాయని) ప్రశ్నచేయుదురని మరియొకవిధముగా మౌనమును చెప్పుచున్నారు అవాఙ్మానసగోచరమగు బ్రహ్మను చెప్పుటకు వీలులేదు గనుక మౌనమందురు. అటులనే ప్రపంచము సత్యమైతే నశించకుండా వుండవలయును. నశిస్తున్నది పోనీ అసత్తందామా గగనకుసుమం వంధ్యాపుత్రుడు శశశృంగం అనగా ఆకాశమందు పుష్పము గొడ్డురాలికి బిడ్డ. కుందేలుకు కొమ్ము మొదలగు అసత్పదార్థములు ప్రత్యక్షముగా గోచరించనట్లు ప్రపంచము మనకు ప్రత్యక్షముగాకనిపించకుండా వుండవలసి వచ్చును. కనిపిస్తున్నది (జాతిక్రియాగుణ శూన్యమయినదే)గనుక బ్రహ్మవలె ప్రపంచముకూడా ఏవిధముగాను చెప్పుటకు వీలులేదుగనుక ప్రపంచముకూడా మౌనమేనని భావము.

శ్లో॥ ఇతివా తద్భవే న్మౌనం సతాం సహజసమ్మతం।
గిరామౌనంతు బాలానాం ప్రయుక్తం బ్రహ్మవాదిభిః॥

తాత్పర్య్య వివరణం.

అద్వైతసిద్ధాతమును గుఱ్ఱెరిగి బ్రహ్మను, ప్రపంచమును చెప్పుటకు వీలులేదుగనుక వివాదములేకుండా వుండుటయే మౌనము. ఇదియే మౌనమని పెద్దలు సమ్మతించిరి.

లోకంలో మాట్లడకుండా వుండుటయే మౌనమని సామాన్యజనులకే బ్రహ్మవేత్తలు చెప్పిరిగాని పైస్థితిలో వారికికాదు. పైస్థితివారికి ఇంతకుముందుచెప్పిన మౌనమేనని భావము, అంతయు బ్రహ్మయేగనుక ఇట్టి మౌనమును గ్రహించవలెను.

శ్లో॥ ఆదావన్తే చమధ్యేచ జనోయస్మిన్న విద్యతే।
యేనేదం సతతం వ్యాప్తం సదేశో విజనస్స్మృతః॥

తాత్పర్య్య వివరణం.

దేశలక్షణమును చెప్పుచున్నారు.

లోకంలో జనంలేనిచోటును నిర్జనప్రదేశమంటారు. ఇక్కడ మాత్రం ఆదియందు అంతమందు మధ్యకాలంలోను ఏ పరమాత్మయందు జనంలేదో. ఏపరమాత్మతోసర్వం వ్యాపించియున్నదో అట్టి పరమాత్మయే దేశమని భావము. నిర్గుణధ్యానమును చెప్పుచున్నారుగనుక సాధనలను కూడా నిర్గుణమునకు అనుకూలముగా నిర్వచించిరి.

శ్లో॥ కలనాత్సర్వ భూతానాం బ్రహ్మాదీనాం నిమేషతః॥
కాలశబ్దేన నిర్దిష్టోహ్య ఖండానంద అద్వయః ॥111

తాత్పర్య వివరణం.

కాలలక్షణము,

బ్రహ్మాది సమస్త భూతములకు నిమేషమాత్రముననే సృష్టిస్థితి లయాధార మగుచున్నది గనుక అఖండమైన అద్వితీయమగు ఆనంద రూపమైన బ్రహ్మయే కాలమని చెప్పబడును.

శ్లో॥ సుఖేనైవ భవేద్యస్మిన్నజస్రం బ్రహ్మచింతనం।
ఆసనం తద్విజానీయాన్నే తరత్సుఖనాశనం॥ 112

తాత్పర్య వివరణం.

ఆసనలక్షణము.

ఏ సుఖరూపమైన బ్రహ్మయందు ఇది చేయవలయును, ఇది చేయ కూడదు అను చింతలేకుండా వుండునో, అట్టి బ్రహ్మతత్వమే ఆసనమని గ్రహించవలయును,గాని సుఖమును నశింపచేసే ఇతర ఆసనములు ఇక్కడ ఆసనశబ్దమునకు అర్ధముకావు. ద్వైతదృష్టితో నున్నవానికి ఏది చేయవల యును, ఏది చేయకూడదు— ఏదిచేసిన సుఖము ఏదిచేసిన దుఃఖము వచ్చు ననే చింతయుండునుకాని అద్వితీయ పరబ్రహ్మతత్వ నిష్ఠకలవానికి ఏచింతాలేదని పరమాత్మైక్యధ్యానములో అంతయు పరమాత్మయేగనుక ఆసనంకూడా పరమాత్మయేనని భావము.

శ్లో॥ సిద్ధం యత్సర్వభూతాది విశ్వాధిష్ఠాన మవ్యయం।
యస్మిన్ సిద్ధాస్సమావిష్టాస్త ద్వైసిద్ధాసనం విదుః॥ ౧౧౩

తాత్పర్య వివరణం.

సిద్ధాసనమగా.

సమస్తమైన భూతభౌతిక ప్రపంచమునకు అధిష్ఠానమైన నిత్యసిద్ధమైన ఏ బ్రహ్మతత్వమందు సిద్ధపురుషులు ఐక్యమును పొందుచున్నారో అట్టి నిత్యసిద్ధమగు బ్రహ్మతత్వమే సిద్ధాసనమని భావము.

శ్లో॥ యన్మూలం సర్వభూతానాం యన్మూలం చిత్తబంధనం
మూలబంధస్సదాసేవ్యోయోగ్యోఽసౌరాజయోగినాం

తాత్పర్య వివరణ.

మూలబంధమునకు లక్షణము.

ఏ బ్రహ్మతత్వం ఆకాశాది సమస్త భూతములకు మూలకారణమో మనస్సుకు కారణమైన అజ్ఞానమునకు కూడా ఏ బ్రహ్మ అధిష్ఠానముగా నున్నదో అట్టి పరబ్రహ్మయే మూలబంధము. సర్వకాలములయందు ఈ మూలబంధమును ఆశ్రయించియే రాజయోగులు అనగా జ్ఞానయోగులు తరించవలయును.

శ్లో॥ అంగానాం సమతాం విద్యాత్సమే బ్రహ్మణిలీయతే।
నోచేన్నైవ సమానత్వ మృజుత్వం శుష్కవృక్షవత్॥

తాత్పర్య వివరణం.

దేహసామ్యమునకు లక్షణము.

శరీరముయొక్క కాళ్ళు, చేతులు మొదలగు అవయవములను అధిష్ఠానమగు సర్వసమమగు బ్రహ్మరూపముగా భావించి శరీరావయముల యందుచంచలత్వంఅనగావిషయములయందు ప్రవర్తించుటలేకుండాచేయు

టయే దేహసామ్యము. శరీరావయవములయందు బ్రహ్మభావన లేనిది చంచలస్థితిపోదు. అదిపోనిది యెండిసచెట్టుకువలె రుజుభావ మేర్పదదని భావము.

శ్లో॥ దృష్టింజ్ఞానమయీంకృత్వా పశ్యేద్బ్రహ్మమయంజగత్।
సాదృష్టిః పరమోదారా ననాసాగ్రావలోకినీ॥

తాత్పర్య వివరణం.

దృక్స్థితి లక్షణము.

దృక్ అనగా దృష్టియే. దృష్టియనగా అఖండ బ్రహ్మాకారమును పొందిన అంతఃకరణవృత్తియే. అంటియు బ్రహ్మయే, నేను బ్రహ్మననే ఈ వృత్తిచేత ప్రపంచమునంతను బ్రహ్మరూపముగా చూచుటయే దృష్టియనబడును. అంతేగాని నాసాగ్రమందు ముక్కుయొక్క చివర భాగమందు దృష్టిపెట్టుట కాదని భావము.

శ్లో॥ ద్రష్టృదర్శన దృశ్యానాం విరామో యత్రవాభవేత్।
దృష్టిస్తత్రైవకర్తవ్యా ననాసాగ్రావలోకినీ॥

తాత్పర్య వివరణం.

ప్రపంచమంతయు బ్రహ్మరూపమేకదా. అట్టిబ్రహ్మ ఇంద్రియములకు గోచరించదుకదా అయినపుడు ఇంద్రియముల దృష్టి బ్రహ్మయందు యెటులననగా చెప్పుచున్నారు. (ద్రష్టదర్శనదృశ్యానాం అని కూడా పాఠ మున్నది.) వేదాంతంలో త్రిపుటియనగా తెలుసుకునేవాడు, తెలియబడేవి, తెలివియను మూడు ఆకారములు. చూచేవాడు, చూడబడేవి, చూపు ఇట్టి త్రిపుటివర్గము ఏబ్రహ్మయందు లయించునో అట్టి బ్రహ్మయందు అంతః

కరణవృత్తిని నిలుపుటయే దృష్టి. కాని నాసాగ్రమందు నేత్రదృష్టిని నిలుపుటకాదు. అన్ని వ్యాపారములను వదలి బ్రహ్మయందే మనస్సును నిలుపుటయని యర్థము.

శ్లో॥ చిత్తాది సర్వభావేషు బ్రహ్మత్వేనైవ భావనాత్।
నిరోధ స్సర్వవృత్తీనాం ప్రాణాయామస్స ఉచ్యతే॥

తాత్పర్య వివరణం.

ప్రాణాయామలక్షణము.

మనోవృత్తులు మొదలగు అన్నిపదార్థములు బ్రహ్మస్వరూపములే నని భావించవలయును. అట్టి భావనవలన కలుగు సర్వవృత్తినిరోధమే ప్రాణాయామము. కాని పాతంజలయోగసూత్రములయందు చెప్పబడిన ప్రాణనిరోధమును ఇచట గ్రహించకూడదు.

శ్లో॥ నిషేధనం ప్రపంచస్య రేచకాఖ్య స్సమీరణః।
బ్రహ్మైవాస్మీతియావృత్తిః పూరకోవాయురీరితః॥

తాత్పర్య వివరణం.

మనోనిగ్రహమునకు సాధనముగా ప్రాణాయామ ప్రక్రియ ఏర్పడినది. ఆ ప్రక్రియలో రేచకము, పూరకము, కుంభకము అని ప్రాణాయామంచేయు విధానం. యోగసూత్రములయందును పురాణాదులయందు కూడా చెప్పబడినది. ప్రస్తుతం శంకర భగవత్పాదులవారు అద్వైతజ్ఞానమున కనుకూలంగా వేరుగా చెప్పుచున్నారు. బ్రహ్మకంటే ప్రపంచం వేరుగా లేదని, ప్రపంచమును నిషేధించుటయే రేచకము. నేను బ్రహ్మనగుచున్నానని అనుకొనుటయే పూరకము.

శ్లో॥ తత స్తద్వృత్తి నైశ్చల్యం కుంభకః ప్రాణసంయమః
అయంచాపి ప్రబుద్ధానామజ్ఞానాం ఘ్రాణపీడనం

తాత్పర్య వివరణం.

అహంబ్రహ్మాస్మి అనగా నేను బ్రహ్మనయితిననే అంతఃకరణ వృత్తిని నిశ్చలముగా నిలుపుకొనుటయే కుంభకమనబడును. బ్రహ్మకండే యేదియు వేరులేదనుకొనుట రేచకను. నేను బ్రహ్మస్వరూపుడనని భావించుట పూరకము. ఈ వృత్తిని నిశ్చలముగా నుంచుకొనుట కుంభకమని చెప్పినట్లయినది. ఇట్టి ప్రాణాయామము జ్ఞానులకే. ముక్కుతో చేయు ప్రాణాయామము అజ్ఞానులకని భావము.

శ్లో॥ విషయేష్వాత్మతాందృష్ట్వా మనసశ్చితిమజ్జనం।
ప్రత్యాహారస్స విజ్ఞేయోఽభ్యస నీయోముముక్షుభిః॥

తాత్పర్య వివరణం.

ప్రత్యాహార లక్షణము.

శబ్దస్పర్శాది సమస్త విషయములయందు సచ్చిదానంద రూపమగు పరమాత్మ స్వరూపములనే దృష్టిని నిలిపి మనస్సును పరమాత్మ స్వరూపముగా నుంచుటయే ప్రత్యాహారము అనగా పరమాత్మయేనని భావించి పరమాత్మయందు లయం చేయుటయే ఇట్టి ప్రత్యాహారమునే మోక్షమును పొందదలచినవారు అభ్యాసం చేయవలయునని భావము.

శ్లో॥ యత్రయత్రమనోయాతి బ్రహ్మణస్తత్ర దర్శనాత్।
మనసోధారణంచైవ ధారణాసాపరామతా॥

తాత్పర్య వివరణం.

ధారణా లక్షణము.

మనస్సు యేయేపదార్థములమీదికి వెళ్ళునో ఆయా పదార్థముల యందు నామరూపాత్మకమగు ఆరోపభాగమును వదలి అనగా నామరూప దృష్టిని వదలి అధిష్ఠానమగు బ్రహ్మయందు మనస్సును స్థిరముగానుంచు అభ్యాసమే ధారణ. మూలాధారము మొదలగు షట్చక్రములయందు మనో ధారణ పాతంజలయోగ సూత్రములయందు చెప్పబడినధారణ అజ్ఞానులకే చెప్పబడినట్లు గ్రహించవలెను.

శ్లో॥ బ్రహ్మైవాస్మీతిసద్వృత్యా నిరాలంబతయాస్థితిః।
ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానందదాయినీ॥

తాత్పర్య వివరణం.
ఆత్మధ్యాన లక్షణం.

దేహాదులను స్మరించకుండా నేను బ్రహ్మననే వృత్తిని నిర్బాధక ముగా నిలుపుకొనుటయే ధ్యానమనబడును. ఇట్టి ధ్యానమే పరమానంద మును కలుగచేయును.

శ్లో॥ నిర్వికారతయావృత్యా బ్రహ్మాకారతయా పునః।
వృత్తివిస్మరణం సమ్యక్ సమాధిర్జ్ఞానసంజ్ఞకః॥

తాత్పర్య వివరణం.

సమాధి లక్షణం.

చిత్తవృత్తియందు ప్రపంచమును గోచరింకుండా చేయవలెను. అట్లే నేను బ్రహ్మను ధ్యానంచేయుచున్నానని ధ్యాతా ధ్యానం ధ్యేయం అను

త్రిపుటిని కూడా మరచియుండవలెనని భావము. వీటిని మరచినప్పుడు ఆ మనస్సు బ్రహ్మాకారముగానే యుండునుగనుక. సమాధి జ్ఞానరూపముగానే యుండునుకాని అజ్ఞానరూపముగా నుండదని గమనింపవలయును.

శ్లో॥ ఇమంచాకృత్రిమానందం తావత్సాధు సమభ్యసేత్।
వశ్యోయావత్క్షణాత్పుంసః ప్రయుక్తస్సన్ భవేత్స్వయం॥

తాత్పర్య వివరణం.

ఈపదిహేను అంగములతో కూడిన నిదిధ్యాసనమువలన స్వరూపభూతమగు పరమానందానుభూతి ఏర్పడును. గనుకనే అభ్యసించవలయును. అభ్యసించినయడల క్షణములో ఆనందానుభవము కలుగును, తను ఆనందరూపుడగునని కూడా చెప్పవలయునని భావము.

శ్లో॥ తతస్సాధన నిర్ముక్తస్సిద్ధోభవతియోగిరాట్।
తత్స్వరూపం నచైతన్య విషయోమన సోగిరాం॥

తాత్పర్య వివరణం.

తరువాత సాధకస్థితినిదాటి సిద్ధుడగును. ఆవాఙ్మానస గోచరమగు బ్రహ్మస్వరూపమే సిద్ధుడని భావము.

శ్లో॥ సమాధౌ క్రియమాణేతు విఘ్నా ఆయాన్తి వైబలాత్।
అనుసంధాన రాహిత్య మాలస్యం భోగలాలసం॥

తాత్పర్య వివరణం.

ఇట్టి మోక్ష ప్రదమగు జ్ఞానయోగమును గురువుల అనుగ్రహము

వల్లనే సులభముగా సాధింపవచ్చునని అనాదరం పనికిరాదు. ఎందుచేతనం టే సమాధిని అభ్యసించు సమయమందు స్మరణ లేకపోవుట, అలసతా(బద్ధకము), భోగాసక్తి మొదలగు విఘ్నములు సంభవించును. గనుక వాటిని నివారించుకొనవలయునని వాటికి లొంగకూడదనియు తాత్పర్యము.

శ్లో॥ లయస్త మశ్చ విక్షేపో రసాస్వాదశ్చ శూన్యతా।
ఏవం యద్విఘ్న బాహుళ్యం త్యాజ్యం బ్రహ్మవిదాశనై॥

తాత్పర్య వివరణం.

విఘ్నము లేవనగా. నిద్ర ఏమి చేయవలెనో, ఏమి కూడదో తెలియక పోవుట యల్లపుడు ప్రపంచవిషయములు గోచరించుట, నేను ధన్యుడనైతినని తృప్తినొందుట, వెనుకటి రాగద్వేషాది సంస్కారముతో మనస్సు మందగించుట ఇట్టి విఘ్నములను మెల్లగా నివారించుకొని ధన్యుడు కావలెనని తాత్పర్యము.

శ్లో। భావవృత్యాహి భావత్యం శూన్యవృత్యాహి శూన్యతా
బ్రహ్మవృత్యాహి పూర్ణత్వం తథాపూర్ణత్వమభ్యసేత్ ॥

తాత్పర్య వివరణం.

మనోవృత్తియే బంధమోక్ష కారణము. ఎటులననగా ఘటాదివిషయ భావనతో ఘటాది విషయాకారమగును, శూన్యమును భావిస్తే శూన్యాకారమగును. బ్రహ్మను భావిస్తే బ్రహ్మాకారమగును, గనుక బ్రహ్మాకార వృత్తినే అభ్యసించవలయును.

శ్లో॥ యేహివృత్తిం జహత్యేనాం బ్రహ్మాఖ్యాం పావనీంపరాం॥
వృథైవతేతు జీవన్తి పశుభిశ్చ సమానరాః॥

తాత్పర్య వివరణం.

ఎవరయితే పరమపవిత్రమైన మోక్షప్రదమైన బ్రహ్మాకారవృత్తిని అభ్యసింపక వదలివేయుదురో, వారు వ్యర్థజీవితముగలవారు పశుసమాను లని తాత్పర్యము.

శ్లో॥ యేహివృత్తిం విజానన్తి జ్ఞాత్వాయే వర్ధయ న్త్యపి।
తేవై సత్పురుషా ధన్యా వంద్యాస్తే భువనత్రయే॥

తాత్పర్య వివరణం.

ఎవరైతే బ్రహ్మాకారవృత్తిని తెలుసుకొని వృద్ధిచేయుదురో వారు పరమధన్యులు. మూడులోకములయందు అందరిచేతను నమస్కరించ తగినవా రగుదురు.

శ్లో॥ యేషాం వృత్తిః సమావృద్ధా పరిపక్వాచసా పునః।
తేవై సద్బ్రహ్మతాం ప్రాప్తా నేతరే శబ్దవాదినః॥

తాత్పర్య వివరణం.

ఏ మహానుభావులకు ఈ బ్రహ్మాకారవృత్తిని సమముగా వృద్ధిని పొంది పరిపక్వ మగునో వారు బ్రహ్మరూపు లగుదురు. అనగా ముక్తు లగుదురు. అంతేగాని ఒట్టి మాటలు చెప్పువారు ఇట్టి స్థితిని పొందరు.

శ్లో॥ కుశలా బ్రహ్మవార్తాయాం వృత్తిహీనాస్సు రాగిణః।
తేప్యజ్ఞాని తయానూనం పునరాయాన్తి యాన్తిచ॥

తాత్పర్య వివరణం.

ఎవరైతే బ్రహ్మతత్వమును. చెప్పుటయందు నేర్పరులే, కాని

బ్రహ్మాభ్యాస వృత్తి లేనివారు విషయవాంఛలు కలవారై యుందురో వారుకూడా అజ్ఞానులేనై జన్మమరణములను పొందుదురని తాత్పర్యము.

శ్లో॥ నిమేషార్థం నతిష్ఠన్తి వృత్తిం బ్రహ్మమయీం వినా।
యథాతిష్ఠన్తి బ్రహ్మాద్యా స్సనకాద్యా శ్శుకాదయః॥

తాత్పర్య వివరణం.

బ్రహ్మాదిదేవతలు, సనకసనందనాదులు, శుకమహర్షి మొదలగు జ్ఞానులవలె. జ్ఞాననిష్ఠులైనవారు అరనిమిషంకూడా వ్యర్థంకాకుండా బ్రహ్మాకారవృత్తితోనే యుందురని బ్రహ్మభావన లేకుండా అర నిముషంకూడా వుండరని తాత్పర్యం.

శ్లో॥ కార్యే కారణతాయాత కారణేనహి కార్యతా।
కారణత్వం తతోగచ్ఛే త్కార్యాభావే విచారతః॥

తాత్పర్య వివరణం.

కుండలు మొదలగు కార్యములయందు మట్టి అనే కారణం అనుగతమగును. మట్టియందు యెల్లపుడు కార్యముల ఆకారముండదు. అందువలన కార్యములు కారణముకంటే వేరేలేనపుడు విచారించినయెడల మట్టికి కారణత్వంకూడా లేదు. అటులనే ప్రపంచమనే కార్యం బ్రహ్మకంటే వేరులేదు గనుక బ్రహ్మ అద్వితీయమేగాని కారణంకాదని తాత్పర్యము.

శ్లో॥ అథ శుద్ధం భవేద్వస్తు యద్వై వాచామగోచరం।
ద్రష్టవ్యం మృద్ఘటేనైవ దృష్టాన్తేన పునః పునః॥

తాత్పర్య వివరణం.

పరబ్రహ్మతత్వము కార్యకారణ భావాతీతమైనది, మనస్సుకు వాక్కుకు (అగోచర మైనవి) తెలియనిది గనుక. మట్టికంటే కుండలు వేరులేవు. బంగారముకంటే భూషణములు వేరులేవు. శుక్తికంటే వెండి వేరేలేదనే అనేక దృష్టాన్తములతో మాటిమాటికి విచారించి తెలుసుకొన వలెనని తాత్పర్యము.

శ్లో॥ అనేనైవ ప్రకారేణ వృత్తిః బ్రహ్మాత్మికా భవేత్।
ఉదేతి శుద్ధచిత్తానాం వృత్తిజ్ఞానం తతః పరం॥

తాత్పర్య వివరణం.

ఈవిచారము జ్ఞానమునకు సాధనమైనట్లు ధ్యానమునకుకూడా సాధన మగునని చెప్పుచున్నారు. ఈరీతిగా పరిశుద్ధమైన అంతఃకరణ కలవారికి ముందు వృత్తిజ్ఞానము కలుగును. తరువాత ఆ వృత్తి బ్రహ్మరూపమగు నని తాత్పర్యము. అనగా ముందు ధ్యానరూపమగు బ్రహ్మవిషయకవృత్తి కలుగును. అభ్యాసపరిపాకదశయందు అఖండాకారవృత్తి కలుగునని తాత్పర్యము.

శ్లో॥ కారణం వ్యతిరేకేణ పుమానాదౌ విలోకయేత్
అన్వయేన పునస్తద్ధి కార్యే నిత్యం ప్రపశ్యతి॥

తాత్పర్య వివరణం.

తత్వవిచార మెటులననగా, ముందు కార్యముకంటే కారణము వేరుగా నున్నదని విచారించవలయును. తరువాత కారణం కార్యముల

యందు అనుగతమై యుండునని విచారించవలయును. అనగా కార్యం కారణంకంటే వేరుగాలేదని తెలుసుకొనవలయును.

శ్లో॥ కార్యేహి కారణం పశ్యేత్పశ్చాత్కార్యం విసర్జయేత్।
కారణత్వం తతో గచ్ఛేద వశిష్టం భవేన్మునిః॥

తాత్పర్య వివరణం.

మరియొకవిధముగా విచారము, కార్యమైన ప్రపంచమును బ్రహ్మయేనని విచారించవలయును. కార్యప్రపంచం లేనపుడు బ్రహ్మ కారణం కూడా కాదు. అట్టి కార్యకారణాతీత బ్రహ్మను మననముచేసిన మహానుభావుడు. అట్టి బ్రహ్మరూపుడే యగును.

శ్లో॥ భావితం తీవ్రవేగేన వస్తు యన్నిశ్చయాత్మనా।
పుమాం స్తద్ధి భవేచ్ఛీఘ్రం జ్ఞేయం భ్రమర కీటవత్॥

తాత్పర్య వివరణం.

అపరోక్షజ్ఞానంకలవారు బ్రహ్మరూపులగుదురు. సందేహం లేదు. పరోక్షజ్ఞానం కలవారిస్థితి యేమంటే. చెప్పుచున్నారు. ఒక తుమ్మెద. ఒక కీటకమును అనగా ఒకరకమైన పురుగునుతెచ్చి తన స్థానమందు ఆ పురుగుచుట్టుతిరుగుచు అరచుచుండును. అంతట ఆ పురుగు భయపడి ఆ భ్రమరమునే స్మరించుచు భ్రమరస్వరూపమగును. అట్లే పరోక్షజ్ఞానము కలవాడుకూడా తీవ్రముగా నిశ్చయబుద్ధితో బ్రహ్మను ధ్యానించినయడల అపరోక్షవృత్తిద్వారా బ్రహ్మరూపుడగునని తాత్పర్యము.

శ్లో॥ అదృశ్యం భావరూపంచ సర్వమేవ చిదాత్మకం।
సావధాన తయానిత్యం స్వాత్మానం భావయే ద్బుధః॥

తాత్పర్య వివరణం.

ప్రత్యక్షముగాను, పరోక్షముగాను ద్రష్టదృష్టి దృశ్యమను అనేక త్రిపుటిరూపముగానున్న ప్రపంచమంతయు ఆత్మయందు ఆరోపితము గనుక ఆరోపితము అధిష్ఠానముకంటే వేరు లేదుగనుక అట్టిసచ్చిదానంద రూపమగు పరమాత్మనే నేనని యెల్లప్పుడు సాధకుడు భావించవలయునని తాత్పర్యము.

శ్లో॥ దృశ్యంహ్య దృశ్యతాం నీత్వా బ్రహ్మా కారేణ చింతయేత్।
విద్వాన్నిత్య సుఖేతిష్ఠేద్ధి యాచిద్రస పూర్ణయా॥

తాత్పర్య వివరణం.

దృశ్యమైన ప్రపంచమును అదృశ్యమైన, అధిష్ఠానమైన బ్రహ్మయే నని నిశ్చయించి సర్వమును బ్రహ్మరూపముగా భావించవలయును. ఇట్లు చింతించిన మహానుభావుడు బ్రహ్మానుభూతినిపొంది నిత్య స్వప్రకాశానంద రూపుడుగానుండును.

శ్లో॥ ఏభిరంగైః స్సమాయుక్తో రాజయోగ ఉదాహృతః।
కించిత్పక్వ కషాయాణాం హఠ యోగేన సంయుతః॥

తాత్పర్య వివరణం.

ఈ చెప్పబడిన అంగములతో కూడిన యోగమే రాజయోగము. కొద్దిగా పరిపక్వమైన రాగద్వేషాది కషాయముకలవారికి అనగా కొద్దిగా రాగద్వేషములు నశించినవారికి పాతంజలయోగ సూత్రములయందు చెప్పిన ప్రాణాయామప్రక్రియ అనే హఠయోగముతోకూడిన ఈ తత్వనిష్ఠయే తరుణోపాయమని తాత్పర్యము.

శ్లో॥ పరిపక్వం మనోయేషాం కేవలోఽయంచ సిద్ధిదః॥
గురుదైవత భక్తానాం సర్వేషాం సులభో జవాత్॥

తాత్పర్య వివరణం.

బాగా పరిపక్వ మనస్సుకలవారికి అనగా రాగద్వేషాదులనే మాలిన్యములు నశించిన (లేని) మనస్సుకలవారికి హఠయోగములేకుండానే ఈజ్ఞాన యోగము అపరోక్షజ్ఞానద్వారా మోక్షప్రదమగును. పరిపక్వముకాని మనస్సు కలవారైనను గురుభక్తి, దేవతాభక్తి కలవారైనయెడల త్వరగానే వారికి ఈ యోగము సులభముగా లభించును. గనుక అన్ని సాధనములకంటే గురుభక్తి, దేవతాభక్తి చాలా గొప్పసాధనములు ముఖ్యముగా వుండతగినవి యని అతి ముఖ్యముగా గమనించవలెను.

ముఖ్యముగా చేయవలసిన విమర్శ.

మోక్షమునకు అపరోక్షానుభూతియే సాధనంకాని, కర్మ సాధనం కాదు. ఉపాసనకూడా సాక్షాత్తుగా సాధనంకాదు, ప్రాణాయామప్రక్రియ ప్రధానమగు హఠయోగముకూడా సాధనంకాదు. కర్మ మోక్షమున కెందుచేత సాధనంకాదంటే, ఉపనిషత్తులయందుగాని, పురాణములయందుగాని, ఇతర శాస్త్రగ్రంథములయందుగాని అంతట జ్ఞానముచేతనే మోక్షము సిద్ధించునని చెప్పుటవలన, మోక్షమునకు జ్ఞానమే సాధనంగాని కర్మ సాధనం కాదని ఒక సమాధానం చెప్పవచ్చును.

దానిమీద మరియొకవిధముగా ప్రశ్నించవచ్చును. శాస్త్రములు వేదములు చెప్పవచ్చునుగాక. మనం విశ్వసించవలసినదే. కాని యుక్తికి, అనుభవమునకు సరిపోవునటుల చెప్పండి అంటే, (సమాధానం) జీవునికి

జీవత్వం, బంధము, సంసారదుఃఖము, జన్మ, మరణములు మొదలగు అజ్ఞానవికారము లెటులవచ్చినవని ముందు విచారించండి.

అజ్ఞానమువలననే జీవత్వము, బంధము, దుఃఖము. జన్మ మరణములు అన్నియు భ్రమరూపముగా నేర్పడినవని. వీటన్నిటికిని మూలమగునది అజ్ఞానమేగనుక అజ్ఞానమునుపోగొట్టునది జ్ఞానమేగాని కర్మ మొదలగునవి కావు. చీకటిని పోగొట్టునది వెల్తురేగాన దిమ్మిట. అలుకుట మొదలగు కర్మలవలన చీకటి పోదని మన కనుభవసిద్ధమేకదా!

అజ్ఞానము చీకటిలాంటిదిగదా. అందువలననే పెద్దలు అజ్ఞానాంధకారమందురు. మామూలు అంధకారంలో ప్రపంచపదార్థములగు దృశ్యములు కనిపించుటలేదు. అజ్ఞానాంధకారములో ద్రష్టయొక్క అసలు స్వరూపం అనగా దృక్కు తెలియుటలేదు. తన స్వరూపమునే తెలియకుండాచేసే అజ్ఞానముయొక్క మహిమయేమని చెప్పవలయును. ఆశ్చర్యమైనవిషయమే.

ప్రతిస్తోత్రమందును శంకర భగవత్పాదులవారు అజ్ఞానమూలకమే బంధమని, జ్ఞానమే దానిని నివర్తింపచేయునని అనేకశ్రుతుల సారమును ప్రబోధించుచునే యున్నారుకదా! భ్రమ అజ్ఞానంవలన యేర్పడునను టలో సందేహములేదు. శుక్తిరజతభ్రమ, రజ్జుసర్పభ్రమ, స్వప్నభ్రమ మొదలగు భ్రమలు అజ్ఞానమువలననే కలుగుచున్నవికదా. నేనెవరని విచారించుచు ప్రపంచం, శరీరం. ఇంద్రియములు నేనుకానని ఇంతవరకు తోసివేసినతరువాత ఆ నేనెవరో తెలియుటలేదుకదా. తెలియకపోతే అజ్ఞానమన్న మాటయేకదా. నేనెవరో తెలియదు అనే అజ్ఞానం అందరికిని అనుభవసిద్ధమేకదా అట్టి అజ్ఞానమువలననే నేనుజీవుడను, కర్తను, భోక్తను, ప్రపంచమును చూస్తున్నాను అను వ్యవహారములన్నియు ఏర్పడినవని చెప్పుటలో అనుభవవిరోధ మేమున్నది?

భ్రమ యన్నపుడు అసలు వస్తువు ఒకటి లేనిది కలుగదువికదా. ఆ అసలువస్తువు బాగుగా తెలియబడినపుడు భ్రమకలుగదుకదా. భ్రమ యనగా ఒకవస్తువు మరియొకవస్తువువలె కనిపించుటయేకదా, నేసనే వస్తువు అనగా ఆత్మయొక్క పరమార్థస్వరూపము తెలియుటలేదుకదా. గనుక అట్టి అజ్ఞాతమైన అనగా తెలియబడని ఆత్మయే జీవునివలె శరీరేంద్రియములవలె ప్రపంచంవలె కనిపించుచున్నదని, అంతయు భ్రమయని దీనికి అజ్ఞానమే మూలమని, అట్టి ఆత్మస్వరూప సాక్షాత్కారం కలిగిన యడల అజ్ఞానంతోసహా భ్రమలన్నియు నశించునని చెప్పుటలో యుక్తికి గాని, అనుభవమునకుగాని, విరుద్ధమేమున్నది? శ్రుతులు, స్మృతులు, పురాణములు అన్నియు ఈ సిద్ధాన్తమునే చెప్పుచున్నవికదా గనుక శాస్త్రమునకు అనుభవమునకు బాగుగా ఐక్యం కుదిరినది. అందుచేత సందేహించవలసిన దేమియు లేదు.

ఇంతకు జ్ఞానమే మోక్షసాధనమని తేలినదిగనుక శంకరాచార్యుల వారు ఈ గ్రంథమునకు అపరోక్షానుభూతియని పేరుపెట్టిరి. అపరోక్ష జ్ఞానమే మూలాజ్ఞానమును, అపరోక్షభ్రమను పోగొట్టును, అజ్ఞానమే పోయినపుడు అపరోక్షభ్రమయు, పరోక్షభ్రమయు అన్నియు నశించును. గనుక పరోక్షభ్రమ పోవునాలేదాయని ప్రశ్నించనవసరంలేదు. అపరోక్ష భ్రమయనగా ప్రత్యక్షముగా గోచరించు భ్రమయే, పరోక్షభ్రమ యనగా ఇంద్రియములకు గోచరించక ఇతరలోకములున్నవి. ఇతరలోకముల యందు అనేక విశేషములున్నవి యనుకొను భ్రమయే. ఇవి యన్నియు ఆరోపమ్ము క్రిందనే చేరును..

ఎంతవారికి ఇట్టి అపరోక్షానుభూతి కలుగునంటే ఈ చివరి శ్లోకంలో స్వామివారు అనుగ్రహముతో శ్లో॥ పరిపక్వం మనోయేషాం

కేవలో ఒయంచ సిద్ధితః, యే మహానుభావులు అనేక జన్మలయందుచేసిన మహాపుణ్యములచే పరిపక్వమనస్సు కలవారగుదురో అనగా పాపములు నశించి నిర్మలమగు మనస్సుకలవారగుదురో అట్టి మహానుభావులు ఇతర సాధనములు అనగా హఠయోగము, ఉపాసన మొదలగు సాధనములు లేకుండానే సాక్షాత్తుగా బ్రహ్మవిచారముచేసి అనగా శ్రవణ మనన నిది ధ్యాసనములనుచేసి జ్ఞానయోగులై అపరోక్షానుభూతి పొంది ముక్తులగు దురు. ఇట్టి యపరోక్షానుభూతి శాస్త్రపాండిత్యముకలవారికే కలుగునుగాని ఇతరులకు కలుగదని చెప్పుటకు వీలులేదు. శంకరాచార్యులవారు యెవరి మనస్సు పరిపక్వమగునో వారికే జ్ఞానయోగమువలన అపరోక్షానుభూతి కలుగునని చెప్పుచున్నారు.

శాస్త్రజ్ఞానం అవసరంలేదని కూడా అనుకొనకూడదు. శాస్త్రజ్ఞానం లేనివారు శాస్త్రమును అర్థంచేసికొని చెప్పుటకష్టం సిద్ధాన్తమును బాగుగా తెలిసికొనక గౌరవమును పొందవలెననే వాంఛతో, అభిమానంతో శిష్యులను సంపాదించి శాస్త్రవిరుద్ధంగాను, సంప్రదాయమునకు విరుద్ధంగాను, ప్రబోధచేసినయెడల తాముచెడి ఇతరులను కూడా చెడగొట్టినవారగుదురు. అందువలన విద్యాభ్యాసం అవసరమే. విద్యాభ్యాసం చేసినంతమాత్రం తోనే మోక్షము నాకు చేతిలోనున్నదని అహంకరించుటకూడా కూడదు.

అయితే శాస్త్రపాండిత్యము లేనివారు కొందరు తత్వమును తెలిసి కొనవలయునని, ముక్తిని పొందవలయునని కోరికకలిగి కొంత విముక్తి మార్గమే మంచిదనేస్థితిలో నున్నవారిగతి యేమంటే "గురుదైవతభక్తానాం సర్వేషాం సులభోజవాత్" అని చెప్పిరికదా, ఈ చివరిశ్లోకమందే గురు భక్తి, దేవతాభక్తి కలవారందరికిని మోక్షప్రదమగు జ్ఞానయోగము అతి త్వరగా సులభముగా సిద్ధించునని తాత్పర్యం.

అన్ని సాధనములకంటే గురుభక్తియు, దేవతాభక్తియు జ్ఞానము నకు చాలా అంతరంగసాధనములు. అనగా గొప్పదగ్గరి సాధనములని యర్థము, శాస్త్రపాండిత్యము లేకపోయినను విశ్వాసముకలిగి, గురుభక్తి దేవతాభక్తి కలిగియున్నవారికి గురువులు చాలా దయతో అనుగ్రహించి తత్వమును ఉపదేశించినయడల అపరోక్షానుభూతికలిగి ముక్తి లభించు నపుటలో సందేహంలేదు. భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునున కిట్లు చెప్పెను. ఆత్మజ్ఞానం చాలా కష్టసాధ్యమని అనిపిస్తూన్నది. యేసాధనము లతో లభించును అంటే "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానిన స్తత్వదర్శినః"

జ్ఞానమెట్లు లభించునంటే సద్గురువుల నాశ్రయించండి, వారి యను గ్రహమును సంపాదించండి. యెటులననగా గురువులకు సాష్టాంగనమ స్కారము చేయవలయును, మమ్ములను తరింపచేయవలయునని జ్ఞాన మనగా నేమి? అజ్ఞానమనగానేమి? బంధమనగానేమి? మోక్షమనగానేమి? జీవుడనగా ఎవరు? జీవస్వరూపమేమి? ఈశ్వరస్వరూపమేమి? నిర్గుణ బ్రహ్మస్వరూమేమి? యని ప్రశ్నించవలయును. ప్రశ్నించుటయేగాక గురువులయందు చాలా విధేయతగానుండి అహంకారమును అణచుకొని, గురువుల పాదశుశ్రూషచేయుచు మరియొకవిధముగాకూడా వారు చెప్పిన పనులు చేయుచు వారికి యనుగ్రహం కలిగేలాగున కూడా ప్రవర్తించవల యును.

ఈవిధముగా పరిచర్యచేసిన శిష్యులకు గురువులు స్వాధీనులై నీకు జ్ఞానము నుపదేశించగలరని అర్జునునకు చెప్పెనను, ఈసంప్రదాయ మంద రికిని వర్తించును. జ్ఞానిన స్తత్వదర్శినః అనుటవల్ల గురువులు తత్వమును శాస్త్రోక్తప్రకారముగా, బాగుగా తెలిసినవారై యుండవలయును. అపరో క్షానుభూతి కలవారై యుండుటకూడా మంచిదే. అపరోక్షానుభూతి లేక

పోయినను సంప్రదాయానుసారముగా శాస్త్రజన్య పరోక్షజ్ఞానమునైనా బాగుగా సంపాదించిన గురువులు కూడా అవసరమే. అట్టివారినే ముందు జ్ఞానంకలుగుటకు ఆశ్రయించవలయును. గురువులుకూడా పరమార్థదృష్టి ప్రధానులై యుండవలయును. ఈవిషయం చాలా గ్రంథములయందు చెప్పబడియున్నది.

శాస్త్రపాండిత్యము లేకపోయినను బాగుగా గురుభక్తి, దేవతాభక్తి కలవారు యథాశక్తి శ్రవణాది విచారంచేయుచు గురుదేవానుగ్రహము వలన అపరోక్షానుభూతిని పొంది ముక్తులగుదురని శంకర భగత్పాదుల వారు సర్వజనులయందు అనుగ్రహముతో ఈ శ్లోకములో సూచించిరి.

గనుక శాస్త్రముచెప్పిన సంప్రదాయమును తోసివేయకుండా వారి వారి యధికారము ననుసరించి యథాశక్తి స్వకర్మానుష్ఠానం చేయుచు తత్వచింతన చేసినయెడల సర్వులు కృతకృత్యులు కావచ్చునని తేలినది.

మరియు భక్తిశ్రద్ధలు కలవారికి జ్ఞానం త్వరగా లభించునని అనేక ప్రమాణవచనములున్నవి. శ్లో॥ శ్రద్ధావాన్ లభతేజ్ఞానం తత్పరస్సంయతేంద్రియః॥ జ్ఞానం లబ్ధ్వాపరాంశాంతి మచిరేణాధిగచ్ఛతి॥ అని కృష్ణ పరమాత్మ అర్జునునకు చెప్పెను.

శ్రద్ధకలవానికి తప్పక జ్ఞానం కలుగును, శ్రద్ధయున్నంతమాత్రంతో చాలదు, తత్పరస్సంయతేంద్రియః అని కూడా చెప్పిరి. తత్పరః అనగా గురూపాసనయందు ఆసక్తుడైయుండవలయునని శంకరాచార్యులవారు భాష్యమందు ప్రతిపాదించిరి. ఇంద్రియములను జయించవలయును. ఈవిధముగా గురుశుశ్రూష చేసినంతమాత్రంతోనే తత్వవిచారంలేకుండా, జ్ఞానంకలుగునని విపరీతార్థం చేసికొనకూడదు. ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానినస్తత్వదర్శినః అనుటవలన తత్వవేత్తలగు గురువులుజ్ఞానము నుప

పొందగలరు అని చెప్పిరి. అందుచేత గురువులవలన తత్వశ్రవణం మననం నిదిధ్యాసనం కూడా అవసరమని చెప్పినట్లే.

కాని శ్రద్ధా, గురుభక్తియు, దేవతాభక్తియు, జితేంద్రియత్వం ఇవికల వారికి శీఘ్రముగా జ్ఞానంకలిగి మోక్షం సిద్ధించును. అని చెప్పిరి. గురు దైవతభక్తానాం సర్వేషాం సులభోజవాత్ అని శంకరభగవత్పాదుల వారును జ్ఞానం లబ్ధ్వాపరాంశాంతి మచిరేణాధి గచ్ఛతియని శ్రీకృష్ణ స్వామివారును ఈ విషయముననే చెప్పిరి. గురుభక్తి అంతప్రధానంగనుకనే శ్రుతికూడా దేవునియందు యెంతభక్తియున్నదో అంతభక్తి గురువు యందు కూడా వుండవలయును. అంత దేవతాగురుభక్తిగల మహానుభావు లకు శాస్త్రీయవిషయము లన్నియు స్పష్టముగా త్వరగా తెలియునని చెప్పు చున్నది. అందువలననే పురాణములయందునూ శ్రుతులయందును స్మృతులయందుకూడా గురుశిష్య సంప్రదాయం విశేషముగా చెప్పబడి యున్నది.

ఈ యపరోక్షానుభూతియందు వేదాన్తవిషయములన్నిటిని అతిసుల భముగా చెప్పిరి. అపరోక్షానుభూతివలన అజ్ఞానము, దేహాత్మత్వభ్రమయు నశించునని అనేక పర్యాయములు చెప్పినవిషయములే. అన్నిటికంటే చాలా ఆశ్చర్యపడవలసిన విషయం. యెంతవిచారించినను, తెలిసికొన్నను అని వార్యమైనది. జీవులందరిని వేధించునది, భౌతికమగు దేహమును నేననే భ్రమయే, స్థూలసూక్ష్మకారణ దేహములలో స్థూలదేహం అందరికిని స్పష్టముగా ప్రత్యక్షముగా కనిపించుచున్నదికదా, ఈ స్థూలశరీరమును మరల ఒకమారు విచారించండి.

మనంభుజించే పదార్థములు భౌతికపదార్థములే. తల్లిదండ్రులు భుజించిన పదార్థములు తల్లియందు శోణితంగాను, తండ్రియందు శుక్లము

గాను పరిణామమును పొందుచున్నవిగదా. ఆ రెండు మాతృగర్భమందు మిశ్రితమైన శరీరమును పుట్టించినవికదా. తల్లిభుజించిన ఆహారపదార్థసారము చేతనే అభివృద్ధినిపొంది నవమాసములు పూర్తిఅయినతరువాత తల్లిగర్భము నుండి శిశువు పుట్టుట అందరికిని అనుభవసిద్ధమైన విషయమేకదా! పుట్టి భౌతికఆహారపదార్థములచేతనే శరీరం పెరుగుచున్నదికదా ! ఇట్టి భౌతిక పదార్థములతో పుట్టి పెరుగుచున్న శరీరమును నేనని సర్వులు అనుకొనుట చాలా ఆశ్చర్యకరమైన విషయమే.

బాగా వ్యక్తతకలిగిన తరువాత తను స్వయముగా పంటలను పండించుచు ఆహారపదార్థములను తయారుచేయుచున్నాడు. అప్పుడు ఆ యాహారపదార్థములను నేను అనుకొనుటలేదు. అయాహారపదార్థము లను పక్వముచేసి భుజించబొయ్యేముందుకూడా ఆ పదార్థములను నేను అనుకొనుటలేదు. అవి వేరు నేను వేరనే అనుకుంటున్నారు. ఆ పదార్థము లను భుజించి జీర్ణమైనతరువాత ఆ పదార్థములేకదా రక్తమాంసాదిరూప ముగా పరిణమించేవి రక్తమాంసరూపముగా పరిణమించి శరీరంలో చేరిన తరువాత రక్తమాంసమయమగు శరీరమును నేను నేను అని అందరు అంటు న్నారంటే ఇది ఆశ్చర్యకరమైన విషయమేకదా! ఆలోచించండి.

గనుకనే విద్యారణ్యస్వాములవారు ఇంతకంటే ఇంద్రజాలిక మేమున్నది. మాతృగర్భమునుండి పుట్టి పెరిగిన ఈ మాంసపిండము యెన్నిపనులు చేయుచున్నది. దీనికి చైతన్యమెట్లు కలిగినది? దేనినుండి చైతన్యము ఈ జడమగు శరీరమునకు సంక్రమించినదో. ఆ చేతనస్వరూ పమేమి? యని ఈశరీరం మీదకలుగు మార్పులునూ చివరకు పడిపోయి నపుడు ఆ చేతనమేమగుచున్నదియని ఆశ్చర్యముగా చెప్పిరి. నిజంగాకూడా ఇదేమియని ఆలోచించినయడల అందరికిని ఆశ్చర్యము కలగవలసిన విషయమేగాని సామాన్యంకాదు.

శంకర భగవత్పాదులవారు వ్రాసిన ప్రతివేదాంతస్తోత్రమందును అధ్యాసస్వరూప స్వభావమును చెప్పి అద్వైతమందు పరిసమాప్తి చేయ బడియే యున్నది. మహా పెద్దలందరు కూడా సాధనచతుష్టయసంపత్తిని సంపాదించి బ్రహ్మవిచారమందే స్థిరమైన మనస్సుకలవారై సర్వకాలముల యందు తత్వచింతన చేయుచునే అపరోక్షానుభూతినిపొంది కైవల్యమును పొందిరని బహుగ్రంథములయందు స్పష్టముగా ప్రతిపాదింపబడిన విష యమే. శంకరాచార్యులవారు సచ్చిదానందరూపమగు పరమాత్మకంటే భిన్నమైన ప్రపంచమును నిందించుచు అపరోక్షానుభూతిని చాలాగొప్పగా చెప్పిరి.

**శ్లో॥ ధాతుర్లోకస్సాధితో వాతతఃకిం విష్ణోర్లోకోవీక్షితో వాతతః**
**కింశంభోర్లోకశ్శాసితో వాతతఃకిం యేనస్వాత్మానైవ**
**సాక్షాత్కృతోఽభూత్॥**

అనగా సగుణబ్రహ్మోపాసనలుచేసి పరిపక్వస్థితినిపొంది చివరకాల మును గుర్తించి బ్రహ్మరంధ్రమును భేదించుకొని సుషుమ్నానాడిద్వారా శరీరములోనుండి బైటికిపోయి అటనుండి అర్చిరాదిమార్గముతో అనేక మంది దేవతలచేత పూజింపబడుచు అనేకలోకములను చూచుచు బ్రహ్మ లోకమునకు వెళ్ళుచుండును. చివరకు బ్రహ్మలోకమునుండి ఒక అమా నవ పురుషుడువచ్చి ఈ బ్రహ్మోపాసనచేసిన మహాపురుషుని బ్రహ్మలోక మునకు తీసుకొనివెళ్ళును. ఈ విధముగా బ్రహ్మలోకమును సాధించినను యేమిప్రయోజనం. తనకు పరమార్థస్వరూపమగు పరమాత్మను సాక్షాత్క రించుకొనలేనప్పుడు. ఏమిచేసినను వేటినిసంపాదించినను ప్రయోజనంలేదు. తన స్వరూపమే తనకు తెలియకపోయినపుడు దేనిని తెలుసుకొన్నను ప్రయోజనంలేదని భావము

ఈవిషయమే ధాతుర్లోక స్సాధితో వాతతఃకిం అనే పై పాదమున కర్థము విష్ణోర్లోకః వీక్షితోవాతతఃకిం॥ అనగా శ్రీమహావిష్ణువుయందు మహాభక్తికలవాడై జీవితకాలమంతయు పూర్వపుణ్య సంస్కారముచేత శ్రీమహావిష్ణువును పూజించి, సేవించి శ్రీమహావిష్ణువుయొక్క అనుగ్రహమునుపొంది భగవంతుని సాక్షాత్కారమునుపొంది అంత్యకాలమందు ఈ దేహమును వదిలి దివ్యదేహమును ధరించి వైకుంఠమునుండి వచ్చిన విమానమెక్కి అనేకలోకములను దివ్యదృశ్యములను చూచుచు దివ్యమగు వైకుంఠమునకు వెళ్ళినను ఆత్మసాక్షాత్కారము లేనివారికి ఏమిప్రయోజనం ? అనగా ఇదంతయు కల్పితవస్తు దర్శనమేగాని పరమార్థదర్శనం కాదుగనుక ఆత్మదర్శనంలేనిది ఇదంతయు నిష్ఫలమనియే భావము.

శంభోర్లోకశ్శా సితోవాతత్కకిం॥ సర్వకాలములయందును శివోపాసనచేసి, పరివారముతో కూడిన శివార్చనచేసి మంత్రరాజమగు శివపంచాక్షరీ మహామంత్రానుష్ఠానంచేసి ఈశ్వరానుగ్రహమునుపొంది అంత్యకాలమున ఈశరీరమును వదరి దివ్యదేహమును ధరించి కైలాసమునుండి వచ్చిన దివ్యవిమానమునెక్కి శివమాతలచే పూజింపబడుచు అనేక దివ్య లోకములను దివ్యదృశ్యములను చూచుచు శివలోకమగు కైలాసమునకు వెళ్ళినను ఆత్మసాక్షాత్కారములేనిది ప్రయోజనమేమున్నది? యేమిప్రయోజనములేదు. శివలోకప్రాప్తియు, అచటకలుగు ఆనందమంతయు కూడా అనాత్మరూపమై ఆరోపితమేగనుక పరమార్థంకాదు. పరమార్థమగుస్వరూపావస్థానమగు మోక్షమునకు సాధనమగు అపరోక్షానుభూతి లేనిది ముక్తి లభించదు, ఇవి సత్యమైన ప్రయోజనములుకావని భావము.

సగుణబ్రహ్మ సాక్షాత్కారమును పొంది సగుణబ్రహ్మలోకమును అనగా సత్యలోకమును పొందినను, ఆ బ్రహ్మలోకాధిపత్యమును సంపాదించినను, విష్ణుసాక్షాత్కారముపొంది వైకుంఠలోకమును పొందినను,

వైకుంఠలోకాధిపత్యమును సంపాదించినను, శివసాక్షాత్కారమును పొంది శివలోకమును అనగా కైలాసమును పొందినను, ఆ కైలాసముపై అధి పత్యమును సంపాదించినను సర్వదేవతోపాసనచేసి సర్వదేవతాసాక్షాత్కార మును పొంది సర్వసిద్ధులను పొందినను, చతుర్దశ భువనములకు అనగా పదునాలుగులోకములకు ఆధిపత్యమును సంపాదించినను స్వాత్మాపరోక్షాను భూతిలేనిది యేమి ప్రయోజనంలేదు. ఇవిఅన్నియు ఆరోపితములు కల్పిత ఫలములు అనిత్యములు. అజ్ఞానదశయందు భాసించునవి సంభవించునవే గనుక నాశములేని సచ్చిదానంద రూపమగు మోక్షమును లభింపజేయు అపరోక్షానుభూతినే సంపాదించవలయునని భావము.

ఈ శ్లోకముకంటే అపరోక్షానుభూతియొక్క గొప్పతనమునుచెప్పే వచనం మరియొకటిలేదని చెప్పవచ్చును. అపరోక్షానుభూతియనగా బ్రహ్మ సాక్షాత్కారమని యర్థము పరమాత్మ మన స్వరూపమైయున్నను పర మాత్మ సాక్షాత్కారమును పొందుట యెంతకష్టమో, యెంతముఖ్యమో, యెంతగొప్పస్థితియో ఈ అపరోక్షానుభూతివలనలభించే మోక్షము యెంత గొప్పదో ఆలోచించండి. శంకర భగవత్పాదులవారు ఈ గ్రంథమునకు అపరోక్షానుభూతియని పేరు పెట్టుట యెంత గొప్పగానున్నదో ఈ గ్రంథ మున కెంతవిలువయున్నదో కూడా గ్రహించవలసిన విషయం.

పరమాత్మ స్వరూపస్థితియగు మోక్షమునుబట్టి బ్రహ్మవిష్ణు శివ లోకములను పొందుటకూడా గొప్పవిషయంకాదు. ప్రయోజనంలేదనిచెప్పిరి గాని అజ్ఞానదశయందుకూడా ఆ లోకములను పొందుట గొప్పస్థితికాదని చెప్పుటలో తాత్పర్యములేదు. దేహాభిమాన మున్నంతవరకు అజ్ఞానదశయే గనుక అజ్ఞానదృష్టినిబట్టి బ్రహ్మాదిలోకప్రాప్తి చాలా గొప్పస్థితియే సందే హములేదు. అయితే బ్రహ్మలోకమునకు వెళ్ళినతరువాత అచట అపరో

క్షానుభూతిని పొంది ఆలోకమందున్న కార్యబ్రహ్మతో సహా బ్రహ్మప్రళయ మైనతరువాత పరమాత్మలో నైక్యమును పొందవచ్చునుకదా? బ్రహ్మలోక ప్రాప్తివల్ల ప్రయోజనం లేకపోవడమేమిటియని ప్రశ్నించవచ్చును.

కాని బ్రహ్మలోకంలో బ్రహ్మసాక్షాత్కారం కలిగే సగుణబ్రహ్మో పాసనలు, అహంగ్రహోపాసనలు కొన్నియేయున్నవి. అటులైనను బ్రహ్మలోకమందైనను అపరోక్షానుభూతిని కలిగినపుడే పునరావృత్తిలేని మోక్షము లభించునుగాని బ్రహ్మలోకమునకు వెళ్లినంతమాత్రంతో లభిం చదు. కొంతమంది కొన్ని సాధనలతోను ఉపాసనలతోను బ్రహ్మలోక మును పొందినను తిరిగి క్రిందలోకములకు వత్తురని ప్రమాణవచనము లున్నవి. గీతావచనం స్పష్టముగానే యున్నది.

శ్లో॥ ఆ బ్రహ్మ భువనాల్లోకాః పునరావృత్తినోఽర్జున।
మాముపేత్యతు కౌంతేయ పునర్జన్మ నవిద్యతే॥

బ్రహ్మలోక పర్యన్తము పునరావృత్తికల లోకములేకావి నన్ను పొందినవారుమాత్రం మరల జన్మనుపొందరని భావము. నన్ను అనగా పరమాత్మను అని యర్థము. గనుక అపరోక్షానుభూతి మహిమ నిట్లు గ్రహించవలయును. అపరోక్షానుభూతి మాహాత్మ్యము చెప్పుటకు శక్యం కాదు శ్లో॥ లబ్ధావిద్యారాజ మాన్యాతతః కిం। ప్రాప్తాసంప్రత్ప్రాభవాఢ్యాతతః కిం భుక్తానారీ సుందరాంగీతతఃకిం యేనస్వాత్మా నైవసాక్షాత్కృతోఽభూత్.

ప్రభువులచేత పూజింపతగిన గొప్పవిద్యలను నేర్చినను యేమి ప్రయోజనం? గొప్ప ఐశ్వర్యంతో తులతూగు సంపత్తును సంపాదించి నను యేమిప్రయోజనం? గొప్ప సౌందర్యముగల భార్యయుండి సంతానం కలిగిన కలభోగములననుభవించినను ప్రయోజనమేమి?ఆత్మసాక్షాత్కార

మను అపరోక్షానుభూతి లేనిది యేమీ ప్రయోజనంలేదు. అందుచేతనే మహా విద్వాంసులును సకలసంపదలతో తులతూగుచున్నవారుకూడా అన్నిటిని వదిలిపెట్టి ఆత్మాపరోక్షానుభూతికొరకు గురుసేవ, ఈశ్వరసేవ చేయుచు కాలంగడుపుదురు.

శ్లో॥ కేయూరాద్యైర్భూషితో వాతతఃకిం కౌశేయాద్యై
రావృతో వాతతఃకిం।
తృప్తోమృష్టాన్నాదినా వాతతఃకిం యేనస్వాత్మానైవ
సాక్షాత్కృతోఽభూత్॥

కొందరు కిరీటములు, భుజభూషణములు మొదలగు అలంకారములను ధరించి శరీరమును బాగుగా నలంకరించుకొని దివ్యపీతాంబరములను అనగా మంచి పట్టుబట్టలను కట్టుకొని, పైనవేసికొని, మాయంతఅదృష్ట వంతులు లేరు, మేము చాలా పుణ్యాత్ములమని అహంకారపూరితులై పెద్దలసేవ చేయుటకును, దైవసేవచేయుటకు కూడా అభిమానత్యాగము చేయలేక అలంకారములకు సౌందర్యమునకు భంగముకలుగునేమోయని అనుమానించుచు ఆత్మాపరోక్షానుభూతి కొరకు పరిశ్రమచేయక వ్యర్థమగు జీవితముకలవారై మోక్షమునకు దూరమై నరకములకు పాలగుదురు.

కొందరు మృష్టాన్నమును భుజించుచు అనగా అనేకపిండివంటలు మొదలగు అమూల్యములగు, ప్రియమగు ఆహారపదార్థములను భుజించుచు మేము చాలా అదృష్టవంతులమని తత్వచింతనచేయక అపరోక్షానుభూతిని సంపాదించలేక మనుష్యజన్మను వ్యర్థంచేయుదురు. మోక్షమునకు అపరోక్షానుభూతియే సాధనంకాని మరియొకసాధనం లేదుగనుక యెన్నిసంపత్తులను సంపాదించినను త్వరగా నశించుననిగనుక వియోగకాలమందు

దుఃఖమును కలుగజేయు స్వల్పసుఖములకే కారణమగునుగాని నిత్యసుఖ రూపమగు మోక్షమునకు సాధనంకావు. గనుక నిష్ప్రయోజనములని భావము.

అనేకదేశములను చూచినను, యెన్ని గొప్పపనులు, చేష్టలు చేసినను ప్రయోజనంలేదు. యెంతమంది బంధువులున్నను, బంధువులలో యెంతగొప్పవారున్నను ప్రయోజనంలేదు. కొందరు పురుషప్రయత్నము చేత దారిద్ర్యబాధను పోగొట్టుకొని. కష్టములను పోగొట్టుకొనినను ప్రయోజనంలేదు. నేననే ఆత్మస్వరూపముయొక్క అపరోక్షానుభూతిని పొందనిది అన్నియు ఉపయోగములేనివేయని భావముగనుక అపరోక్షానుభూతి మహిమ చెప్పుటకలవిగానిదని సర్వులు గుర్తించతగిన విషయము.

మరియు శ్లో॥ స్నాతంతీర్థే జహ్నుజాదౌతతఃకిం। దానందత్తం ద్వ్యష్టసంఖ్యం తతఃకిం జప్తామంత్రాః కోటిశోవాతతఃకిం యేనస్వాత్మా నైవ సాక్షాత్కృతోఽభూత్॥ అపరోక్షానుభూతిమహిమ ఈ శ్లోకమును చదివి విచారించండ, సాక్షాత్తు విష్ణుపాదమునుండిపుట్టి జహ్నుమహర్షిచే సంపాదించబడి ఆకాశమండలములోనుండి బయలుదేరి సమస్తలోకముల యందు ప్రవహించుచు ఆయాలోకములయందు ఆయావర్ణములతో గోచరించుచు ఆయా లోకములయందున్నవారు ఆ గంగానదిని చూచినను, స్మరించినను, స్నానంచేసినను, పానముచేసినను అందరినీ పవిత్రము చేయుచూ భగీరధుడను మాహానుభావునిచేత భూలోకమునకు తీసుకురాబడిన గంగానదియొక్క మాహాత్మ్యము కాశీఖండం, దేవీభాగవతం మొదలగు గ్రంథములయందు చాలా గొప్పగా చెప్పబడియున్నది. ఆ గంగానది హిమాలయపర్వతములలోనుండి భూమండలమునకు దిగి గంగోత్తరి మొదలగు క్షేత్రములలోనుండి ప్రవహించుచు కాశీమహాపట్టణమువద్దకు వచ్చి అటనుండి ప్రవహించుచువెళ్ళి సముద్రములో కలసినది.

గంగానది ప్రవహించిన ప్రదేశములన్నియు మహాక్షేత్రములైనవని స్పష్టమే కదా. లలితాత్రిపురసుందరియే దేవతలు ప్రార్థించగా గంగానదిగా అవతరించి ప్రవహించుచున్నదని కూడా కథలున్నవి. అట్టి గంగానదిని స్మరించినను, దర్శించినను స్నానపానములు చేసినను సర్వపాపరహితులై ఉత్తమలోకములను పొందుదురనికూడా మాహాత్మ్యము కలదు. ఇట్టి అతిత మగు మాహాత్మ్యముగల గంగానదియందుగాని మూడుకోట్ల యేబదిలక్షల తీర్థములను దర్శించి సేవించి ఆ తీర్థములయందుగాని స్నానంచేసినను ఆత్మసాక్షాత్కారములేనిది యేమిప్రయోజనమని శంకరాచార్యులవారు స్నాతంతీర్థే జహ్నుజాదౌతతఃకిం అని చెప్పిరి.

"భగవద్గీతా కించిదధీతా గంగాజలలవకణికాపీతా, సకృదపియేన మురారి సమర్చాకురుతేతస్య యమోఽపినచర్చాం" ఈశ్లోకమును భజగోవింద శ్లోకములలో శంకరాచార్యులవారు చెప్పిరి. భగవద్గీతను కొంచెం చదివినవారిని గంగోదకమును కొద్దిగానైన త్రాగినవారిని, ఒకప్పుడైనను శ్రీ మహావిష్ణువును పూజించినవారిని, యమధర్మరాజుకూడా విచారించడని యర్థము. యమధర్మరాజు విచారించడంటే యమలోకమునకు పోరని పుణ్యలోకములను పొందుదురని చెప్పవచ్చును. గాని మోక్షములభించునని చెప్పలేదు. గనుక అపరోక్షానుభూతియే మోక్షప్రదమని గమనించవలయును.

"దానందత్తం ద్వ్యష్టసంఖ్యం తతఃకిం" కొందరు ధనవంతులు షోడశమహాదానములను శాస్త్రము చెప్పినట్లుగా చాలా గొప్పగా చేయుదురు. దానివలననే ముక్తి లభించునని భ్రమపడకూడదు. అందుచేతనే యేమి దానివలనని చెప్పిరి. "జప్తామంత్రాః కోటిశోవాతతఃకిం" సప్తకోటి (యేడుకోట్లు) మహామంత్రములను జపించినను ఆ మంత్రముల అర్థమును విచారించినను, ఆ మంత్రములసిద్ధిని పొందినను యేమిప్రయో

జనం. "యేనస్వాత్మానైవ సాక్షాత్కృతోఽభూత్" అని చెప్పిరి. అనగా యెవనిచేత తన ఆత్మసాక్షాత్కరింపబడదో అని యర్థము. అనగా యెవరు నేననే ఆత్మయొక్క పరమార్థస్వరూపమును సాక్షాత్కరించుకొనరో వారు పైచెప్పిన మహాపుణ్యము లెన్ని చేసినను ప్రయోజనంలేదు. మోక్షము కలుగదని యర్థము. ఆత్మసాక్షాత్కారమన్నను, అపరోక్షానుభూతియన్నను. బ్రహ్మసాక్షాత్కారమన్నను ఒకటేగాని వేరేఅర్థముకాదు.

అపరోక్షానుభూతి యెంతమహోన్నతమైనదో గ్రహించవలసిన విషయం.

శ్లో॥ గాత్రం సమ్యగ్భూషితం వాతతఃకిం। గాత్రంభస్మాచ్ఛాదితం వాతతఃకిం।।
రుద్రాక్షాదిః సుధృతో వాతతఃకింయేనస్వాత్మానైవ సాక్షాత్కృతోఽభూత్।।

శరీరమును తలంటిపోసుకొనుటను సుగంధద్రవ్యములచేతను, తిలకధారణముచేతను, అనేకవిధములైన భూషణములచేత నలంకరించిననూ ప్రయోజనంలేదు. భోగములను పదలుచూ బాగుగా భస్మధారణచేసి రుద్రాక్షలను బాగుగాధరించి యోగివలెనున్నను ప్రయోజనంలేదు. అపరోక్షానుభూతియేకావలయునుగాని ఇవన్నియు మోక్షప్రదములుకావని తాత్పర్యము.

శ్లో॥ అన్నైర్విప్రాస్తర్పితా వాతతఃకిం। యజ్ఞైర్దేవాస్తోషితా వాతతఃకిం।
కీర్త్యావ్యాప్తా స్సర్వలోకాస్తతఃకిం యేనస్వాత్మానైవ సాక్షాత్కృతోఽభూత్॥

అనేకమంది పుణ్యాత్ములు అన్నసత్రములను యేర్పాటుచేయుదురు. విద్యాతపస్సంపన్నులగు బ్రాహ్మణులకు మృష్టాన్నప్రదానం చేయుదురు. కొందరు పుణ్యాత్ములు యజ్ఞములనుచేయుచు దేవతలకు హవిర్భాగములతో తృప్తికలుగచేయుదురు. ఇదియేపరమార్థముగాని వేరులేదని తత్వచింతనలేకుండాకూడా నుందురు. మరికొందరు సర్వకాలములయందు పరులకుఉపకారముచేయుచు ఇతరులుబాగుండుటయే నాజీవితమునకు పరమావధి యని భావించుచు ఇదియే నాకు తరుణోపాయమని. "కీర్తిం స్వర్గఫలామాహురాచంద్రార్కం విసశ్చిత:" బాగా కీర్తిని సంపాదించినవారు సూర్యచంద్రులు ప్రపంచంలో ఉదయాస్తమయములను చూపించుచూ సంచరించుచున్నంతవరకు స్వర్గలోకములో మహాసుఖమును పొందుదురని పెద్దలు చెప్పుచున్నారుగనుక కీర్తిని సంపాదించుటయే మంచిదని ప్రపంచమంతానిండే కీర్తినే సంపాదించుదురు.

కాని వీటివలన ప్రయోజనమేమీలేదు. సంతానముతో నేమిప్రయోజనం, కీర్తితోనేమిప్రయోజనమని మహానుభావులు వీటినివదలి ఆత్మయొక్క అపరోక్షానుభూతిని సంపాదించుటయే ప్రధానమని అపరోక్షానుభూతిచేతనే స్వరూపానందలాభం కలుగుననియు అనకున్నట్లు వచనములు లకవు.

శ్లో॥ కాయఃక్లిష్టశ్చోపవాసైస్తతఃకిం లబ్ధాఃపుత్రాస్స్వియ
పత్న్యాస్తతఃకిం।
ప్రాణాయామస్సాధితో వాతతఃకిం యేనస్వాత్మా నైవ
సాక్షాత్కృతోఽభూత్ ॥

చాలా నిగ్రహముతో అనేక ఉపవాసములుచేసి శరీరమును బాధపెట్టుచు, ఈవిధముగా నుండుటయే తరుణోపాయమని ఇదియే చాలాగొప్ప

స్త్రీయని పట్టుదలతో భావింతురుగాని ప్రయోజనంలేదు. అనేకమంది కొడుకులు కలిగి వారందరు చాలా విద్యావంతులై, ధనవంతులైయున్నను ప్రయోజనంలేదు. పుత్రులవలననే తరించగలమని యనుకొనుటకూడా మంచిదికాదు. మరియు కొందరు ప్రాణాయామ ప్రక్రియను అభ్యసించుచు ఇదియే మనకు ముక్తిసాధనమని దానివలన కొన్నిసిద్ధులను పొందవచ్చునని హఠయోగమే ప్రధానమని చేయుచుందురుగాని, అపరోక్షానుభూతి లేనిది పరమపురుషార్థమగు మోక్షము సిద్ధించదని భావము.

శ్లో॥ యుద్ధేశత్రుర్నిర్జితో వాతతఃకిం భూయోమిత్రైః పూరితో వాతతఃకిం।
యోగైః ప్రాప్తాసిద్ధయో వాతత్కకిం యేనస్వాత్మానైవ సాక్షాత్కృతోఽభూత్॥

మహారాజులుగాని, ఇతరులుగాని,యుద్ధమందుగాని. ఇతరవ్యవహారములయందుగాని శత్రువులను జయించి మేము చాలా ధన్యులము విజయమును పొందితిమని భావించి ఇట్టివిజయముకొరకే పాటుపడుచుందురు. ఈ రాగద్వేషములచేతనే కాలం గడుపుచుందురుకాని ప్రయోజనంలేదు. స్నేహితులకు బాగుగా ఉపకారంచేయుచు ఇంతసహాయము చేయగలిగితినని అభిమానించుచూ నా జీవితం సఫలమైనదని కాలంగడుపుచుందురు. కాని ప్రయోజనంలేదు.

కొందరు యోగాభ్యాసంచేత అణిమాదిసిద్ధులను సంపాదించి లోకమందు వినియోగించుచు పరమార్థమును మరచి ఇదియే పరమార్థమని సంతోషించుచు కాలక్షేపం చేయుదురుగాని ప్రయోజనం లేదు. గనుక ఆత్మస్వరూపాపరోక్షానుభూతిని సంపాదించి తరించవలయునేగాని వేరుమార్గం

లేదు. మోక్షమునకు జ్ఞానంకంటే వేరుమార్గంలేదని శ్రుతులు చెప్పు చున్నవి గనుక అపరోక్షానుభూతి మహిమ యెంతగొప్పదో గమనించవల సిన విషయము.

శ్లో॥ అబ్ధిః పద్భ్యాం లంఘితోవాతతఃకిం వాయుః కుంభే
స్థాపితో వాతతఃకిం।
మేరుః పాణావుద్ధృతో వాతతఃకిం యేనస్వాత్మానైవ
సాక్షాత్కృతోఽభూత్॥

పాదములతో సముద్రమును దాటినను అనగా అంతసామర్థ్య మును పొందినను ప్రయోజనములేదు. అగస్త్యులవారు గొప్పయోగశక్తితో సముద్రోదకమును పూర్తిగా ఆచమనంతో త్రాగిరిగాని దానితో ప్రయోజ నమని వారు భావించలేదు. అపరోక్షానుభూతియే ప్రధానమని భావించి అపరోక్షానుభూతిని సంపాదించిరి. మహావాయువును యోగశక్తితో ఆక ర్షించి ఒకపాత్రయందుంచినను అనగా అంతసామర్థ్యమును సంపాదించి నను ప్రయోజనములేదు. అట్టి యోగశక్తులు కలవనుటలో సందేహము లేదు.

చిన్నకథ. శంకరాచార్యులవారు పిన్నవయస్సులోనే ఆశ్రమస్వీ కారంచేసి గురూపదేశమును పొందుటకు గోవిందభగవత్పాదులవారు ఒక పర్వతగుహలో తపస్సుచేయుచుండుగా వారివద్దకువెళ్లిరి. గోవింద భగవత్పాదులవారు మౌనంగా సమాధినిష్టలోనుండిరి. అంతట శంకరా చార్యులవారు సమాధిలోనున్నవారిని మాట్లాడించకూడదుగనుక ఊరికినే కూర్చుండిరి. అంతలో ఒక ప్రళయవర్షము అచటను చూరప్రాంతములోను కురిసి మహాప్రవాహములు నలుదిక్కులనుండి ప్రవహింపసాగెను.

ఆ మహాప్రవాహములలో కొన్ని గ్రామములు, కొన్ని ప్రాణులును కొట్టుకొనిపోవుచుండెను. అంతట శంకరాచార్యులవారికి దయకలిగి యోగశక్తులయందు స్వయముగా ఆదరంలేకపోయినను పరోపకారంకొరకు ఉపయోగింపతలచి ప్రవాహమున కెదురుగా వారికమండలం పట్టిరి. అంతట ఆప్రాంతమందు ప్రవహించు అన్ని ప్రవాహముల ఉదకమంతయు శంకరాచార్యులవారి కమండలములోనికిచేరి యిమిడినది. అప్పటికప్పుడు నీరు తగ్గి మెరకఅయినది. ప్రాణులు ప్రమాదంలేకుండా సురక్షితములుగా నుండెను.

అచట తపస్సుచేయువారు, ప్రమాదమునుండి సురక్షితులైన ప్రాణులును ఈ యాశ్చర్య సంఘటనను, ఆ జలమునంతయు ఆకర్షించిన పాత్రను చేతపట్టుకొనియున్న శంకారాచార్య దివ్యమంగళ స్వరూపమును కన్నులారా చూచి పరమానందమును పొందిరని కథ శంకరవిజయంలో నున్నది. ఆ తరువాత గురువుగారగు గోవింద భగవత్పాదులవారు సమాధినుండి కళ్ళుతెరిచిచూచిరి. అంతట శంకరులవారు నమస్కరించిరి. గోవిందభగవత్పూజ్యపాదులవారు ఈ సామర్థ్యమును, శంకరమూర్తిని చూచి ఆనందపడిరి. తత్త్వోపదేశం చేసినతరువాత కథాశేషమిది. శంకరాచార్యులవారు యోగశక్తిచేతనేకదా యింతపని చేయడం జరిగినది. ఇట్టి శక్తులుకూడా అపరోక్షానుభూతి క్రింద తృణప్రాయములని శంకరాచార్యస్వామివారి తాత్పర్యం.

మేరుపర్వతమును మొత్తం భూమిలోనించి పెగలించి శ్రీకృష్ణపరమాత్మ గోవర్ధన పర్వతమును ఒకచేతిలో యెత్తి (ఓవేలుమీద) ఆపినట్లు ఆ మేరువును చేతులో పెట్టుకొన కలిగినను ప్రయోజనంలేదు. యే మహాతత్వమందు ఇవన్నియు కల్పితములైయున్నవో, యేపరమాత్మ

సత్తాప్రకాశలచేతనే సత్తాప్రకాశలు కలిగి ప్రపంచమంతయు భాసించు చున్నదో అట్టి పరతత్వమే మనకు పరమార్థ స్వరూపమైనపుడు అట్టి మన స్వరూపమును మనం తెలుసుకొనలేని అజ్ఞానదశయందుండుటకంటే దైన్యస్థితిమరొకటి లేదు. ఆస్థితినిబట్టి అన్నియు స్వప్నదృశ్యప్రాయములే గనుక కల్పిత భోగములు సత్యములని భ్రమించకూడదని తాత్పర్యం.

శ్లో॥ శ్వేశః పీతో దుగ్ధవద్వాతతః కిం।
వహ్నిర్దగ్ధో లాజవద్వాతతః కిం।
ప్రాప్తశ్చారః పక్షివత్తేతతః కిం,
యేనస్వాత్మా నైవసాక్షాత్కృతోఽభూత్॥

ద్రవమగు కాలకూటవిషమును పాలు త్రాగినట్లు త్రాగియిముడ్చు కున్నను అనగా అట్టి సామర్థ్యమును యోగశక్తిచేతగాని మణిమంత్రౌ షధములచేగాని సంపాదించినను ప్రయోజనంలేదు. క్షీరసముద్రమును దేవతలు రాక్షసులు మధించునపుడు క్షీరసముద్రములో నుండి అనేక భోగ్యవస్తువులు వచ్చినవి, వాటిని అందరు అమోదించిరి, అ తరువాత (హాలహాలం) మహావిషం పర్వతాకారముగా పైకివచ్చినది. దానిగంధ మును కూడా ఇతరులు సహించలేని స్థితిలో ఈశ్వరుడు ఆ మహా విషమును మ్రింగి కంఠములో నుంచుకొనెను.

ఆశక్తిని జీవులను రక్షించుకొనుటకు ఉపయోగించెను కాని అట్టి శక్తియే పరమార్థ సాధనమని జీవులకు తెలియచేయడమందు ఈశ్వరునికి తాత్పర్యం లేదు. వందేచర్మకపాలకోప కరణైర్వైరాగ్య సౌఖ్యాత్పరం నాస్తీతి ప్రదిశంతమంతవిధురం శ్రీకాశికేశంశివం అని ఒక భక్తుడు ఈశ్వరుని ప్రార్థించెను. ఈశ్వరుడు చర్మమును ధరించి కప్పుకొని

బ్రహ్మకపాలంచేత పట్టుకొని శరీరమంతయు భస్మపూసుకొని యున్నా దంటే వైరాగ్యముకంటే సుఖం మరియొకటి లేదు. వైరాగ్యంతో అపరో క్షానుభూతిని సంపాదించి తరించమని జీవులకు ప్రదర్శించుటయందే ఈశ్వరునికి తాత్పర్యమని పెద్దలు చెప్పెదరు. అట్టి వైరాగ్యమూర్తినే ఆ భక్తుడు ప్రార్థించెను.

అగ్నిర్గర్గోలాజవద్వాతతః కిం॥ రుచిగానున్న పేలాలను కరకర నమిలి మింగినట్లు అగ్నికణములను నమిలి మింగే సామర్థ్యమును సంపా దించినను ప్రయోజనం లేదు. పక్షులు ఆకాశమందు స్వేచ్ఛగ సంచరించి నటుల ఆకాశమందు సంచరించే శక్తిని సంపాదించి సంచరించినను ఉపయోగంలేదు. ఇట్టి సిద్ధులను, తృణప్రాయముగా చూచి అపరోక్షాను భూతియందే దృష్టిపెట్టుకొని బ్రహ్మవిచారంచేసి అపరోక్షానుభూతిని సంపాదించి కృతకృత్యులు కావలయునని తాత్పర్యం.

పంచభూతములను స్వాధీనంచేసికొన్నను, అగ్నిస్తంభన, జల స్తంభన మొదలగు గొప్పపనులుచేయు శక్తిని సంపాదించినను, లోహము లను భేధించుశక్తిని సంపాదించినను ప్రయోజనం లేదు. సిద్ధాంజనం మొదలగు కాటుక కళ్ళలో పెట్టుకొని భూమిలోనున్న నిధి నిక్షేపములను అనగా గనులను, యెవరయినా పాతిపెట్టిన ధనమును కనుగొని సంపా దించినను ప్రయోజనంలేదు. చక్రవర్తి సార్వభౌముడైనను ప్రయోజనం లేదు. దేవేంద్రపదవిని సంపాదించి సర్వభోగములను అనుభవించినను ఉపయోగంలేదు. అపరోక్షానుభూతియే మోక్షమునకు అవసరమని గ్రహించవలయును.

సన్యసించి యతిశ్రేష్ఠుడైనను ఉపయోగంలేదు. మంత్రములచేత సర్పులను స్తంభింపచేసే శక్తిని సంపాదించినను ప్రయోజనంలేదు.

దనుర్వేదమును బాగుగా చదివి బాణములచేత లక్ష్యమును భేదించినను అట్టి సామర్థ్యమును సంపాదించినను ప్రయోజనంలేదు. భూతకాలమందు, వర్తమానకాలమందు, భవిష్యత్కాలమందు జరిగే వృత్తాన్తములన్నిటిని తెలిసికొని చెప్పగల సామర్థ్యమును సంపాదించినను ప్రయోజనంలేదు. యేశక్తులను సంపాదించినను, యేపనులుచేసినను, యే భోగములను అనుభవించినను ఉపయోగంలేదు. అన్నియు నశించునవియే గనుక నిత్య పురుషార్థమగు మోక్షమునకు సాధనమైన అపరోక్షానుభూతిలేనిదీ నిరుపయోగమని తాత్పర్యం.

ముఖ్యంగా ఈ విషయమును గ్రహించవలయును. అపరోక్షానుభూతిని దృష్టిలో పెట్టుకొని బ్రహ్మాదిలోకములను, మహా యోగశక్తులును, సకలవిద్యలును, స్వర్గాదిసుఖములను, ఇంద్రాది దివ్యపదవులును చాలా కొద్దిఫలములని చెప్పిరి. ఈ యానందములన్నియు మనకు స్వరూపమగు బ్రహ్మానందముయొక్క లేశములే. ప్రతిబింబానందములేగాని పారమార్థికములుగావు. మహాసముద్రములో గాలికి నీటితుంపుర్లు బయలుదేరినట్లు బ్రహ్మరూపమగు ఆనందంలో నుండియే తక్కిన ఆనందములన్నియు బయలుదేరినవని శ్రుతి చెప్పుచున్నదని అనేకమార్పులు చెప్పబడిన విషయమే.

అందుచేతనే మోక్షము అన్నిటికంటే చాలా గొప్ప పురుషార్థము. జ్ఞానదశయందు అనగా కొన్నికోట్ల జన్మలనుండి సంపాదించిన పుణ్యములచేత పవిత్రుడైన కొన్నికోట్ల జీవరాసులలో, ఒకానొక మహానుభావునికే బ్రహ్మపరోక్షానుభూతి కలుగును, అట్టి మహానుభావునికే సచ్చిదానంద రూపమగు స్వస్వరూపావస్థానమగు మోక్షము లభించును గాని సర్వులకు సులభంకాదు. ఈ స్థితిని బ్రహ్మాదిలోకములు స్వల్పములని చెప్పిరి. ప్రయోజనంలేదని చెప్పిరి గాని అజ్ఞానదశయందున్న మన

మందిరము యోగ్యతలేకుండా అన్నియు స్వల్పములని యనుకొనకూడదు. అన్నియూ గొప్పవనియే విశ్వసించవలయును.

వైరాగ్యంలేని యజ్ఞానదశలో పాపక్షయమగుటకు వైరాగ్యం కలుగుటకు దేవతాపూజ చేయవలసినదే. దానములూ చేయవలసినవే, ధర్మములూ ఆచరించవలసినవే, ఉపాసనలూ చేయతగినవే! పెద్దలసేవా చేయతగినదే,తీర్థయాత్రలూ చేయతగినవే. స్వకర్మలు అనుష్ఠింపతగినవే, యజ్ఞాదులూ చేయతగినవే, అసగా యజ్ఞానదశయందు అన్నియు ఉన్నవి. గనుక శాస్త్రములను పెద్దల ఉపదేశములను తప్పక నమ్మవలసినదే కాని ఇదియే పరమార్థమనుకొనకూడదు. అన్నింటిని ఆచరించుచూ ఈశ్వరార్పణం చేసిన సర్వపాపములు తొలగి అంతఃకరణశుద్ధి కలుగును. తరువాత బ్రహ్మవిచారము వలన అపరోక్షానుభూతి కలుగును. అట్టి యపరోక్షానుభూతివలన ముక్తికలుగునని తాత్పర్యం.

అబ్బా అంత కష్టంకదా బ్రహ్మజ్ఞానం, అంత కష్టంకదా మోక్షమును సంపాదించుట యని నిరుత్సాహముతో ప్రయత్నం ఎవ్వరును మానకూడదు. కొందరికి ఒక జన్మలోనే వైరాగ్యం కలిగి అపరోక్షానుభూతి కలిగి మోక్షము లభించును అట్టివారి విషయంలో వారికి అనేక జన్మల పుణ్యమున్నట్లే మనం అర్థంచేసుకొనవలయును గాని ఏమీలేకుండా పూర్వజన్మ కృషిలేకుండా సిద్ధిని పొందరని యనుకొనకూడదు. ఏ జీవునికి యెంత పూర్వజన్మ పుణ్యమున్నదో, మంచి సంస్కారము లెన్నియున్నవో మనకు తెలియవు కనిపించేవికావు. సామాన్యజనులకు కూడా త్వరలో జ్ఞానం కలిగి ముక్తిలభించును. వారికి పూర్వజన్మల పుణ్యములు, సంస్కారములును ఉన్నట్లే.

చిగురుటాకును నలుపుట అయినా కొంచెంకష్టం ప్రయత్నం చేయ

వలయునుగాని నేననే పరమాత్మను అంతకన్నా సులభముగా తెలుసుకొన వచ్చునే యెందుకు తెలుసుకొనలేవు.గనుక తత్వవిచారం చేయవలసినదేనని, యోగవాసిష్టమందు వసిష్టమహర్షి చెప్పినట్లున్నది. ఒకప్పుడు బ్రహ్మ విచారముచేసినను కొన్ని ప్రతిబంధకములవలన ఈ జన్మలో అపరోక్షాను భూతి లభించకపోయినను ముందుజన్మలోనైనా తప్పకకలుగును. అందు వలన నిరుత్సాహములేకుండా శాస్త్రమును ప్రమాణముగా విశ్వసించుచు, ప్రాచీన సంప్రదాయమును ప్రమాణముగా నమ్ముచూ లోకానుగ్రహముగల వేదశాస్త్ర సంప్రదాయమును గుర్తెరిగిన విద్వాంసుల వచనములను నమ్ముచూ ఆత్మజ్ఞానమునకు ఈ మనుష్యజన్మలో మనుష్య జీవులందరును వారివారి శక్తిననుసరించి, వారివారి యధికారముల ననుసరించి గట్టిప్రయ త్నం చేయవలసినదేగాని కాలం వ్యర్థంచేయకూడదు.

ఈజన్మపోతే ముందు ఏ మవుదుమో తెలియదు. ఏజన్మవచ్చునో తెలియదు. పశుపక్షి మృగాదులజన్మ వచ్చినయెడల ఆ జన్మలలో కర్మ లను చేయలేము, జ్ఞానం సంపాదించలేముకదా. అందువలన మనుష్య జన్మ చాలా పుణ్యంవల్లగాని లభించదు, ఇట్టి అమూల్యమగు మనుష్య జన్మకాలం ఐహికమునకు కొంత ఉపయోగించినను, ఆముష్మికమునకు అనగా జీవనం జరుగుటకు కొంతకాలము నుపయోగించినను, నరకం లేకుండా నుండుటకును. పాపజన్మలు లేకుండా నుండుటకును, అసలు జన్మలు లేకుండా ముక్తిని సంపాదించుటకును అతిజాగ్రత్తగా కాలం గడు పుచూ తత్వవిచారం చేయవలయును.

ఈ గ్రంథము అపరోక్షానుభూతియనే పేరుకలదికదా. అనగా మోక్షగ్రంథమే, సందేహంలేదుకదా. ఇది అందరికిని సులభముగా తెలి యుటకే శంకరాచార్యులవారు వ్రాసిరి. అందరనగా శ్రద్ధాభక్తులుకలవారే గాని విశ్వాసంలేనివారుకాదుగనుక ఈ గ్రంథమును బాగుగా అర్థముచేసి

కొనవచ్చును. అందుచేత నాశక్తివంచనలేకుండా స్ఫురించినంతవరకు తాత్పర్యమును వ్రాయుచు కొన్ని విశేషములను కూడా ఉదహరించుచు ప్రకృతమునకు అనుకూలముగా కొన్ని ప్రమాణవచనముల నుదహరించి తిని. ఆ వచనములకు తాత్పర్యంకూడా వ్రాసితిని. అందులోకూడా అప రోక్షానుభూతియనే పేరు చాలా గొప్పగానున్నదిగనుక ఆ యపరోక్షాను భూతి గొప్పతనమును చెప్పుటకు శంకరాచార్యులవారు రచించిన ఇతర స్తోత్రశ్లోకములనుకూడా ఈ గ్రంథముయొక్క చివర ఉదహరించి తాత్ప ర్యమును వ్రాసితిని.

గనుక ఆస్తికజనులందరు ఈ శంకరాచార్య విరచితమగు అపరో క్షానుభూతిని బాగుగాచదివిగాని, లేక పెద్దలవద్దవినిగాని తత్వమును గ్రహించి తరించగలరని విశ్వసించుచున్నాను. నేనువ్రాసిన ఈ తెలుగు తాత్పర్యము సంస్కృతభాషయందు పరిచయంలేనివారికి కూడా బాగుగా ఉపకరించును. అద్వైతసిద్ధాన్తమును బాగుగా తెలిసికొనుటకునూ చాలా ఉపకరించుననే విషయం చూచి మీరే తెలుసుకొనగలరు. అపరోక్షానుభూతి గ్రంథము సమాప్తము.

ఇట్లు శంకరాచార్య విరచిత అపరోక్షానుభూతిపై మద్దులపల్లి మాణిక్యశాస్త్రిచే రచింపబడిన తత్వరహస్య ప్రభయను తెలుగు తాత్పర్య వివరణం సమాప్తం.

శ్రీః శ్రీః శ్రీః

